# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

జన్మదిన సంచిక - నవంబర్ '67

(త్రైమాసిక)

5

1967 నవంబర్

నిర్వాహణ

'సాహితీ మిత్రులు'—

ముఖచిత్రం: బుచ్చిబాబు

చిత్రకారుడు: శీలా వీర్రాజు.

వివరాలకు, ప్రత్యుత్తరాలకు
వరవరరావు
జడ్చర్ల (రైల్వే స్టేషన్),
మహబూబ్‌నగర్ జిల్లా.

వెల: ఒకరూపాయ.

# కళాతపస్వి

"తన వ్యక్తిత్వాన్ని దిగమింగి అహంని జయించటంలోనే కళాకారుడి పురోగమనం ఉందన్న సూత్రాన్ని నేను స్వీకరిస్తాను"-అన్నాడు బుచ్చిబాబు తన "అంతరంగ కథనాన్ని" ముగిస్తూ. ఆ మాటని అక్షరాలా జీవించిన కళాకారుడు బుచ్చిబాబు

బుచ్చిబాబుకి ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక విశిష్టమైన స్థానం ఉంటుంది

బుచ్చిబాబు చాలా సాహితీ ప్రక్రియల్లో కృషి చేసినా, ఆయన ప్రథమంగా కథకుడు తెలుగు కథానికను మళ్ళీమళ్ళీ చదివించే ఒక ఖండకావ్యంలా రూపకల్పన చేసిన కథకుడు బుచ్చిబాబు ఆయన కథల్లో గొప్ప కవితావేశం, కళాపటిమ సౌందర్యదృష్టి, మనోవిశ్లేషణగోచరిస్తాయి. ఆయన కథలన్నింటిలోను వస్తువు-మానవుడి అంతరంగం, చాలామంది కథకులు మనిషిని బాహ్యంగా మాత్రమే చూపిస్తారు-బుచ్చిబాబు తనకథల్లో మనిషి అంతరంగాన్ని వివిధ రూపాల్లో చిత్రిస్తారు. ఆధునిక నాగరకతలో పూర్తిగా లౌకిక విలువలకి లొంగిపోతున్న మానవుడిలో ఎక్కడో అణిగిమణిగి ఉన్నకళాతృష్ణ, అలౌకిక విలువలు ఒకానొక సన్నివేశంలో ఉప్పొంగి బయటపడటం ఆయన కథల్లో చూస్తాము. ఆయనవ్రాసిన 'మేడమెట్లు' 'ఎల్లోరాలోయేకాంతసేవ' 'నిరంతరత్రయం' 'అరకులోయలో కూలిన శిఖరం' 'నన్ను గూర్చి కథవ్రాయవూ' 'బి' 'తడిమంటకి పొడినీళ్ళు' మొదలైన కథలు తెలుగు పాఠకుల్ని యుగయుగాల వఱకు ఉఱ్ఱూతలూగించగల గొప్పఖండకావ్యాలు

ఆయనవ్రాసిన యేకైక నవల "చివరకు మిగిలేది" తెలుగు నవలా సాహిత్యంలో చరిత్రను సృష్టించిన నవల అది నవల కాల్పనికోద్యమంనుండి బయటపడి నిజమైన ఆధునికతను సాధించటం-'చివరకుమిగిలేది'తో ప్రారంభమైంది. ఈ నవలలో బుచ్చిబాబుసృష్టించిన పాత్రలు-దయానిధి, కోమలి, అమృతం-తెలుగువాళ్ళ కలల్నీ, కన్నీళ్ళని, గాథల్నీ, బాధల్నీ శాశ్వతంగా పంచుకుంటారు. కలకాలం తఱిగిపోని సౌందర్యంతో విలసిల్లే ఒక కళాఖండం 'చివరకు మిగిలేది'.

రచనల్లోనే కాదు-నిత్యజీవితంలోను-నిజమైన కళోపాసకుడుగా, సంపూర్ణ మానవుడుగా, స్నేహవత్సలుడుగా జీవించిన గొప్పకళాతపస్వి బుచ్చిబాబు. నడివయస్సులోనే ఆయన మనకి దూరమైనా సాహితీ లోకంలో బుచ్చిబాబు అమరుడు.

"సృజన" ద్వారా ఆ కళాతపస్వి దివ్యస్మృతికి కన్నీటితో జోహార్లు అర్పిస్తున్నాము.

# సృజన
త్రైమాసిక
నవంబర్_1967.

ఈ సంచికలో:

కళా తపస్వి

కవిత


| | | |
|---|---|---|
| చేదుపాట | 1 | డా॥ సి. నారాయణరెడ్డి |
| ఆత్మహత్య | 2 | ఐ |
| స్వాతంత్ర్య రథచక్రఘోష | 3 | వరవరరావు |
| జఠరాగ్ని | 7 | తంగిరాల |
| నగ్న చిత్రం | 9 | జయసూర్య |
| క్షామ వేదం | 10 | మిరియాల రామకృష్ణ |
| అక్కడైనా కలిసిబతికేమా! | 13 | మౌలాలి |
| పాపం! నున్న రామయ్య | 14 | గిరీశం |

బుచ్చిబాబుని గూర్చిన ప్రత్యేక రచనలు

| | | |
|---|---|---|
| దయానిధి మనస్తత్వ పరిశీలన | 17 | నవీన్ |
| నాకు తెలిసిన బుచ్చిబాబు | 42 | సి. యస్. రావు |

బుచ్చిబాబు అసంపూర్ణ రచన

| | | |
|---|---|---|
| వయసు నొసలుపై ముసలిరేఖలు | 50 | బుచ్చిబాబు |

కథ

| | | |
|---|---|---|
| గానుగెద్దు జీవితాలు | 52 | సోదుం జయరామ్ |

చర్చావేదిక

| | | |
|---|---|---|
| జీవితానుభవంలో హేతువాద దృష్టి | 58 | అట్లూరి రంగారావు |

సాహిత్య చర్చ

| | | |
|---|---|---|
| కుందుర్తి మహాప్రస్థానకావ్యమీమాంస | 60 | ఆర్వియార్ |

సమీక్షలు

| | | |
|---|---|---|
| వచన కవిత | 64 | అద్దేపల్లి రామమోహన్ రావు |
| మానవుడే మా సందేశం | 76 | విలోకి |

డా॥ సి. నారాయణరెడ్డి.

# చేదుపొర

మనసు నిండింది—మధువక్కర్లేదు
తలపు పండింది—కలలక్కర్లేదు
లయ తెలిసింది హాయలక్కర్లేదు
పువ్వు పిలిచింది—నవ్వక్కర్లేదు

నేనున్నాను—నీవక్కర్లేదు
నీవున్నావు – నేనక్కర్లేదు
అంచులు విడివుంటేనే ఆనందం
హంసలు కలవకుంటేనే అందం

గరళం కనిపిస్తే గటగట త్రాగు
అమృతం అందిస్తే అరనిమిషం ఆగు
జావగార్చే అమృతం కంటె
జ్వాల రగిల్చే గరళం బాగు

నడివీధిలో—అంగడి వీధిలో నడువు—గొం
గడి పురుగులా ముడుచుకోకుండా
వెలుగింటికి—దివ్వెల మింటికి నడువు—కో
వెల నీడలో కునుకు తీయకుండా

కాదన్నది కాదనకు
ఔనన్నది ఔననకు
'కాదూ ఔను'ల నడుమ
చేదుపొర లేదనకు

# ఆత్మహత్య

ఏకాంతాన్ని మేస్తూ
జ్ఞాపకాల్ని నెమరేస్తూ
కలల కళ్ళతికించుకుని
నేనొకణ్ణీ ఈ గట్టుమీద
చుట్టూ
మసగ్గా విసుగ్గా
వికారంగా విచిత్రంగా
భయంకరంగా లోకం
ఈ గట్టు మీద నేనొకణ్ణి
కింద
పారే ఏట్లో
ఊహల్లో చేప పిల్లలు
అవి
ఆవలి ఒడ్డున ఆకర్షిస్తున్న ఏ గాలం చివరి ఎరకో బలి?
పాదాలకింద ఒడ్డును కితకితలు పెడ్తున్నాయి అలలు
అరవేసిన కనురెప్పల కింద
ధారలుగా ప్రవహిస్తున్న కన్నీటి పొరల కింద
మరుగుతున్నాయి
కరుగుతున్నాయి
భవిష్యత్తు కలలు
ఒంటరిగా ఈ గట్టు మీద
నేనొకణ్ణీ ఈ ఇంద్రియాల్ని మూసేస్తే
ఈ వంచక కీటక లోకమంతా
బంద్!

వరవరరావు.

# స్వాతంత్ర్యరథచక్రఘోష

సముద్రగుప్తుడు పాలించిననాటి స్వర్ణయుగమా
రాయలు పాలించిన రత్నసీమా
దేన్ని గురించి రాస్తున్నావు కవీ—
బీహారులూ, రాయలసీమలూ నిండినదేశం గురించి
బేహారులూ, బేమాన్‌లూ నిండిన దేశంగురించి?
(బెంగాల్ పోనీ, మలబార్ పోనీ, చివరకు
మరిచిపోయే ఉంటావు తెలంగాణ కోటి రత్నాల విపంచి).

* * * *

ఇరవయ్యేళ్ళుగా సాగుతున్న ఇండిపెండెంట్ రథానికి
ఇరుసా? నారా? సారథి సంగతి సరేసరి
నేనేనని ప్రతి ఎన్నికల తిరునాళ్ళలో
చెప్తూనే ఉన్నారాయె
సారంలేని జీవితంలో ఐదేళ్ళకొకసారి సారా!
చాలా? ఎవడుగెలిస్తేమాత్రం ఒరిగింది ఏమిటి?
(ఏమిటీ, నిన్న కట్టిన వంతెనా! విపరీత కాలం!)
ఆ రథంలో ఎవ్వడో మీటుతున్నాడు విపంచి
ఆరగట్టిన అన్నార్తుల పేగుల్నిచించి
(పాడుతున్నాడు అద్భుతంగా క్షామనిధి గురించి)
నిన్న ఓటుకోసం వచ్చినపుడు
ఒట్టేయించుకోడానికి ఎంత ప్రేమగా
నాచేయి తన చేతుల్లోకి తీసుకున్నాడు!
ఇవ్వాళ- ఇవేవోపూలు- ఈ దండ వేద్దామన్నా
ఈ చేతులకేకాదు. ఈ చూపులకి అందడు దేవుడు!

దేవుడన్నా నా ఆయనను, ఎంత తెలివితక్కువవాణ్ణి.
మా పూరి గుళ్ళో గుండ్రాయికి నెరసిన నరసింహస్వామి
ఎన్నాళ్ళాయె ఎటూ కదలక
పూజారి ఆచారి పూలు పెట్టినా పత్రి పెట్టినా
మాట్లాడనే మాట్లాడడు (అయినా మనిషి గనక నా?)
పనీలేదు (ప్రాణమూ లేనట్లు ఉన్నది)

మా రాజు, (అయినా-రాజుల కాలం బూజుపట్టి
పోయిందట! మా వూళ్ళో విప్లవ కవి అనగా విన్నాను)
కాదు. మా మంత్రి మాట్లాడుతూనే ఉంటాడట.
అవేవో సభల్లో, పత్రికల్లో, రేడియోలో
(మాట్లాడుతూ కూచుంటే పనులెట్లాగవుతాయి?
అన్నది చిన్నబుర్రల అర్థంలేని సందేహమని
మా పూళ్ళో రాజకీయవాది చెప్పాడు.)

*    *    *    *

ఇరవయ్యేళ్ళ స్వాతంత్ర్యం ఎంత మార్పు తెచ్చిందని!
ఇరులు చీలి వెల్తుర్లు వచ్చినవి.
(దీపంతో పాటు క్రీనీడనూ ఓర్చుకోవాలి మరి)
అడవులన్నీ ఆవాసాలు అయినవి.
పులులుపోయి తోడేళ్ళు మిగిలినవి.
పిల్ల జమీందారు జిల్లాకు చేర్మన్
పట్వారీ కొడుకు పంచాయతీ సర్పంచ్
కంట్రాక్టరయితేమీ, కనుచాటు వర్తకం చేస్తేనేమీ
కల్లమ్మితేనేమి కల్లలాడితేనేమీ
ఖద్దరితనమో, గద్దరితనమో వహిస్తే చాలు,
కామందు సామాన్యుల సామ్రాజ్యానికి అతడు.
రాజుగారి కిరీటం తీసేసి తెల్లటోపి పెట్టుకుంటే
మంత్రివేశానికి ఎంత బాగా నప్పారని!
విక్రమార్కుని సింహాసనం ఎక్కితే

వె[ర్రివాడూ విజ్ఞానం పలికేవాడట
గాంధిమహాత్ముని అహింసకు మొక్కితే
రజాకారో రౌడో ఎవడైనా సరే
నిజాయితీమార్కు సింహాసనం ఎక్కినాడు.
ఋతువులూ జారిపోయినవి
రుజువర్తనమూ మారిపోయింది
ఎంతకాలపు మూసికకు చలిబొంత వేసికుట్టే
ఆకాశపు సూదిలోంచి వానదారం ఈగడమేలేదు.

*   *   *   *

స్వాతంత్ర్య రథం వచ్చిందని
రథంలో దేవుళ్ళు వచ్చారని
ఊళ్ళో తిరునాళ్ళ వచ్చింది
పట్టిగా పారేసే కట్టెకూ ధర వచ్చింది
బట్టకూ, ఆఖరికి పొట్టకూటికే ధర పెచ్చింది
మట్టిలోపుట్టి మట్టిలో పెరుగుతున్న నేను
రంగులో, రూపులో, మనసులో మారిందిలేదు.
వంగితే వరిమళ్ళలో నాట్లకో
లేస్తే పజ్జొన్న కోతకో
నడిస్తే నాగళ్ళ వెంబడో
చూస్తే మేఘాల దిక్కుకో
పస్తులుండో, ఏళ్ళునిండో చస్తే-
సామాన్యుని చావుకి ప[త్రికలు ఏడుస్తాయా?
స్వాతంత్ర్య రథారోహకులకు గాని
చ[క్రాలకు [ప్రాణమా? చరి[త్రా?!
ఎన్నడయినా చరి[త్రలో ఎక్కడయినా ధరి[త్రిలో
పేదవాడి స్వేదంతో బతికిన సా[మ్రాజ్యం
వాడివేదన సంగతి, ఆవేదన గతివిన్నదా, కన్నదా?
కనీ, నీవు మా[త్రం ఈగకన్న దోమ కన్న
హీనమయిన మా బతుకుకథ రాస్తావా?

స్వాతంత్ర్య రథికులకథ రాస్తావు తప్ప.
మేమందరమూ ఏ దేవుణ్ని అడిగి తెచ్చుకున్నామో
ఈ బతుకులు. అక్కడికి తొందరగాపోయే
మార్గమయినా చెప్పరు ఈ మారాజులు.
గట్టిగా మృత్యువు నయినా పిల్వకుండా పిలువకుండా
భయం భయంగా మా నెత్తి మీది పెత్తందారు
చెప్పుకింది అధికారాన్ని శ్వాసించి బతుకుతున్నాం.
తెగించి తిరుగుబాటు ఆకలి పేగులు
శరీరంమీద చేస్తే ఏంలాభం
శాసనం కింద ఒదిగి ఒదిగి నిద్రపోతున్నవి మనసులు

మేమూ మనుషులమే
మా మాటల్లో నిరాశ ధ్వనిస్తున్నదా
సరిగా వినండి!
స్వాతంత్ర్య రథారోహకులారా!
చక్రఘోష వినండి!!
ఏ చక్రంలోని ఒక్కసీల ఊడి పడినా
మీ ఊహాలోకాల్లోంచి కుప్పలా కూలి పోతారు.
ఏ చక్రం దిగబడి పోయినా
మీరు ఊబిలో పడిపోతారు
స్వాతంత్ర్య రథచక్రాల్లో ప్రతి సామాన్యుడు ఒక ఆరె.
విప్లవరథం పట్టిందా రథం, విగ్రహాలవని సరేసరి!

# జఠరాగ్ని

—తంగిరాల

అమ్మా...ఆకలి...
అయ్యో...ఆకలి...
తల్లీ! మాగాకబళం!
ఏడుపూ ఆకలీ ఏకమై
చీకటీ జీవితం ఒక్కటై
బక్క చిక్కి, డొక్క చచ్చి
ఒక్కణ్ణీ ఇక్కణ్ణే ఒరిగి పోతున్న...
దేవుడా! రక్షించు ఈ దీనుణ్ణి!
నాగరకతా నరకంలో పడి మ్రగ్గుతున్న మానవుణ్ణి!

* * * *

జనాభా ఎక్కువ: మాయదారి దేశం
ఏంచేస్తాం మరి? మనది 'కర్మభూమి'!
కడుపునిండినా నిండకపోయినా
కర్మచేయడం మనవంతు
ఫలితం భగవంతునికి వదిలేద్దాం!
మొన్న బెంగాల్‌లో, నిన్న రాయలసీమలో, నేడు బీహార్‌లో
ఆకలి సుడిగాలులెడతెగక వీచి
బ్రతుకు చెట్టునుండి పచ్చని ఆకుల్ని రాల్చివేశాయి...
జఠరాగ్ని భీకరకీలలు ఛట్‌ఫట్ చుట్టుముట్టి
జీవనాడుల్ని కాల్చివేశాయి...
తుట్టలు తుట్టలుగా శవాలు
గుట్టలు గుట్టలుగా శవాలు
ఎక్కడ చూచినా జీవచ్ఛవాలు
కదిలే కంకాళాలు...

అటంబాంబుని కనిపెట్టిన అతనెవరో
ఆకల్ని హతమార్చే బాంబుని కనిపెట్టలేదేం చెప్మా!
మతప్రచారానికి కోటానుకోట్ల డాలర్లు క్రుమ్మరించే మూర్ఖుడు
ప్రజల్ని మలమల మాడ్చిచంపే ఆకలి మహమ్మారి బారి నుండి
అదుకోదేం చెప్మా!

ప్రపంచమంతా ప్లేగులా వ్యాపించింది ఆకలి
ప్రతిమానవుడి కడుపుమీదా పెద్దమ్మోరులా శివమెత్తి ఆడుతోంది ఆకలి
ఆకలిమనుసుల్లో యుద్ధం పుడుతుంది
యుద్ధం కడుపులో ఆకలి దాక్కొని ఉంటుంది
ఆకలే యుద్ధం, యుద్ధమే ఆకలి
ఇది ఇరవయ్యోశతాబ్దపు ఆల్జీబ్రా

కాంగోలో, క్యూబాలో
లావోస్‌లో, సైప్రస్‌లో
పాకిస్తాన్ హద్దుల్లో, సూయజ్ కాలువ ఒడ్డున
వియత్నాంలో, చైనా నడివీధుల్లో—
శాంతిపావురాళ్ళను రెక్కలు విరిచికట్టి, 'గావుపట్టి'*
పచ్చినెత్తురుతో జాతర జరుపుకుంటున్నా
నా ఆకలి తీరడం లేదు...

మనుషుల్ని, మంచి రుచియైనవాళ్ళని,
మహామేధావుల్ని, నవనాగరకతా స్రష్టల్ని
పరమేశ్వరుని సృష్టిలో ఉత్తమోత్తముల్ని పట్టి
కాళ్లూ చేతులూ తెగ్గొట్టి
తలకాయలు చితగ్గొట్టి
తారుపీపాల్లో వేసి ధవ్వళం కాచుకొని
కండల్ని టోమాటో పండుల్లా జుర్రుతూ
ఎముకల్ని లేతములగకాడల్లా చీకుతూ

*బలిపశువును నోటితో కొరికి చంపడాన్ని 'గావుపట్టుట' అంటారు. ఈ పని గ్రామదేవతల జాతరలలో జరుగుతూ ఉంటుంది.

కనుగ్రుడ్డుల్ని నల్లద్రాక్షగుత్తుల్లా గుటుక్కున మ్రింగుతూ
వీధిలో వెఱ్ఱిగంతులేస్తున్న నేను మానవుణ్ణి...!
ఇరవయ్యో శతాబ్దపు నాగరకతా న్యయాబయార్ లో
యథేచ్ఛగా విహరిస్తున్న దానవుణ్ణి...!!
నన్ను చూస్తుంటే జాలివేస్తోందా?
నా ఆకలి వింటూంటే భయం వేస్తోందా?
అయ్యో...
పాపం......
మానవుడు.........!!

## నగ్న చిత్రం —జయసూర్య

'గిన్స్‌బర్గ్'–'గో నేకెడ్'!
'ఎవాగార్డ్' మీద మరో యవనిక
హంగరీలో గాయపడ్డవాళ్ళు
బెంగాల్ లో ఆకలిగొన్న వాళ్ళు
బ్రిటన్ లో ఎంగ్రీ యంగ్‌మన్
నాగరికత రంగుతెరలు చింపేస్తున్నారు
ఆకలి వాళ్ళరక్తాన్ని మండిస్తోంది
ఆవేశం, కసి గుండెల్ని పిండేస్తోంది
మొండి కళేబరాలకు ఆక్సిజన్ అందిస్తూ
ప్రేమ జ్వలించి ఏడ్చేస్తున్నారు
యవ్వనం రాక్షస రతి చేస్తూంటే
స్వచ్ఛత తెల్లబోయింది

–X–

# క్షామ వేదం

—మిరియాల రామకృష్ణ.

నీలి మేఘాన్ని తోలుకు పోతోంది
    ఏదో ప్రభంజనం వరుణ శాసనంలా
నేల కట్టుకున్న సస్యామల చేలం
    ఎందుకో చినిగిపోతోంది!

ఆకలి విరుచుకు పడుతోంది నాల్కలు చాచిన దావాగ్నిలా
దరిద్రత వణకిస్తోంది పడగలు విప్పిన కాళీయుడిలా

ఈ వేళ ఈయింటికతిథులు పదివేలమంది!
అంతా పసిపాపలు! చింతా చీకూ వీళ్ళకేం తెలుసు!

రేపు పదివేలమంది తల్లులయ్యేరోజు!
ఈ పురిటింట్లో రేపు పాలుపూచే నవ్వు!

ఇంత పరమానందం గృహస్థోత్సవానికి ఆనవాలు!
ఇంట్లో అన్నీ నిండుకుని, దీపం కొండెక్కుతోంటే గగ్గోలు!

పచ్చగడ్డి లేదని పాలుచేపలేదు ఆవులు!
రక్తపుష్టిలేక తెఱతీయ లేదు పాలిండ్లు!

ఈ వేళ ఈ క్షుధాగ్నిమీద చన్నీళ్ళెవరు చల్లేరు?
ఈఅన్నపూర్ణ నిర్వీణ వదన నీరజం మీద మంచునెవరు తొలగించేరు?

వట్టిపోయిన రైసుమిల్లు నిశ్శబ్దంగా నిలబడింది!
ఇబ్బంది ఏదుపందిలా ముళ్ళువిప్పి మీదపడింది!

    ఈ క్షామజ్వాలనుండి తప్పుకోడమెలా
    ఈ భారాన్ని దించుకోడమెలా

ఈ నిజాన్ని కాదనడమెలా
ఈ ఎడారిలో ఒయాసిస్సెక్కడ?

2

"సముద్రాల ఆవల సంపన్నులైన బంధువుల యింట్లో
సరకులప్పుగా తెచ్చుకోడానికి వెళ్లింది కబురు!

ఆగండి పిల్లలూ ఆగండి! ఉన్నదే సర్దుకోండి!
అందాకా ఏడుపుపాటల పాత్రలలోని కన్నీళ్ళు

అరగ్రుక్కెడైనా పుచ్చుకోండి! దీపాలార్పకండి!
నూరేళ్ళ బ్రతుకులో నిరాశను నూరుమైళ్లు తరమండి!"

3

"గృహస్థూ! అవతలి వీధిలో రేషనుషాపుకు వెళ్ళి
ఇన్ని కేజీలబియ్యం ఇమ్మను!

ఎనిమిదోవంతైనా ఇయ్యక పోరు!
నీ ఆశాలతకు కొన్ని నీళ్ళయినా పొయ్యకపోరు!"

4

రేషను కార్డునూ రిక్తహస్తాల గృహస్థునూ చూచి
నీడల మేనుల్ని మేడలు ముడుచుకుంటున్నవి చూడు!
మబ్బుగొడుగు మర్చిపోయిన మధ్యాహ్న సూర్యుడి చిరాకు
ఆకలిమంటకు ఆమ్రేడితంలాగుంది నేడు!

గృహస్థు చెవుల్లో గడియారం పన్నెండు పిడుగులు వేసింది!
ఙామవేద శ్రుతివిన్న ఋషిలాగున్నాడు గృహస్థు
అన్నార్తిని యముడికి చెప్పుకోబోయిన వారివే
వార్తా పత్రికల్లో నల్లగా కనబడున్నాయి అంకెలు!

5

పాకశాలలోనుండి అగ్ని మకాం మెత్తుకుపోయినదేదీ
ఎవరూ డైరీలో వ్రాసుకున్నట్లు కనిపించదు!

నయనాలయంలోకి నిరాశ అద్దెకుదిగినరోజు
బహుశా కన్నీళ్లలో చెరిగిపోయిందేమో గుర్తులేదు!

అన్నాల అంగళ్ళముందున్నారు
ఎంగిళ్లకయినా ఆశపడే పిల్లలు!
క్షామ కాళిందీ తటాలమీది పెల్లలు!
క్షుధానల జ్వాలల మీది పుల్లలు!

6

ఆత్మహత్యలో పడబోయేవాళ్ళకు
వడ్డీల చక్రవర్తుల కస్సుబుస్సులు తప్పలేదు!

అడ్డం తిరిగిన జీవిత కథలో
సమస్యల కహకహలు తగ్గలేదు!

ఆకలీ మర్యాదా అవమానం గొలుసులు
నగరంలోనైనా తెగలేదు!

క్రిమిప్రబలమైన కబళంలోంచి
బుసబుసలాడే రుజా పథాలనుంచి
ముసురుగొన్న మృత్యువు నీడలోకి
వెళ్ళిపోతున్న నిరుపేదలకు దిక్కు తెలియలేదు!

7

రక్తమందిరంలో దీప్తి తగ్గింది
ఆవేశం కొడగట్టింది!
విగతావేశ స్వగతం వినే దేవుడేడీ!
స్వగతాలు వినిపించుకునే స్వామి ఎక్కడ?

ఇతని వ్యథకు క్షుధకు తీరాలెక్కడ
ఈ క్షామవేదానికి ఈ క్షుధావాదానికి
ఎవడయ్యా శ్రోత
ఏడయ్యా త్రాత

# అక్కడయినా కలిసి బతికేమా?

—మౌలాలీ.

పట్టెడు కూటికి పడే పడిగాపుల్లోనో
నా మాంసం తింటూ, చెమట తాగుతూ
నీవుచేసే చీత్కారాల్లోనో, తిరస్కారాల్లోనో
కాయలుకాచి బండబారిన పాదాల్తో
రోజూ నడిచే గతుకుల రోడ్డుకడ్డంగా బడో
అనామకంగా అంతం కావచ్చు నా దేహం.

పేగులు కాల్చి పేర్చిన ధనరాసుల్లోనో
నేనుచేసే నమస్కారాల్లోనో, సన్మానాల్లోనో
కొయ్యని కడుపుకోసం వెతుక్కుంటూ
అంబాసిడర్ కారుసీటుకు జారగిలబడో
ఆలస్యంగానో, హఠాత్తుగానో
నా వెనుకేరావచ్చు నీ దేహం.

ఎద పలుకని మాటలు చెప్తూనో
నా గొంతులో గాజుముక్కలుకలిపి
తేనెపోస్తూనో కూలిపోవచ్చునీవు
జీర్ణావయవాలు నెత్తురుకక్కి నేను
కనీస కోరికలుతీరకనో
కీళ్ళసలుపుడు భరించలేకనో
రాజకీయాల్లోని పాకల దాహనక్రియల్లోనో
దిక్కేదని చెట్లు, చేలు, శ్రమ
కళ్ళనీళ్ళు కారుస్తున్నప్పుడు
నా జీవితం అంతం కావచ్చు.

అత్యాచారాల్లోనో, అమానుషత్వంలోనో
రేపటి పాపాల జాబితా నెమరేస్తూనో
అందాల అంతస్తులు కూలిన రాళ్ళకుప్పల్లోనో
ఆస్తికోసం వారసులు
కుక్కల్లా, నక్కల్లా కరుస్తున్నప్పుడు
ఏదో వొకనాటికి, యేదో వొకరీతిగానీవు
అరమరికల్లేకుండా అంతమౌతాం
అక్కడైనా సుఖంగా, సఖ్యంగా వుంటాం.

# పాపం, నున్న రామయ్య

—గిరీశం

## నాంది

నున్న రామయ్య ఇంటిపేరు పాపం కాదు.
అతనుచేసిన సేవల గుర్తించి, వేసిన చేనులగురించి
అటుప్రభుత్వమో, ఇటు ప్రజో, ధర్మంచేసిన బిరుదుకాదు-
అయితే...రామయ్య పాపంలోపుట్టి, పాపంలోపెరిగి, పాపంలో...!

## కథ

నున్నరామయ్య ఈదేశం 'దున్నేవాడి భూమిదేశం'
అనాదిగా కృషిప్రధానమైనదేశం, అందునా ఆంధ్రదేశం
నడిబొడ్డునున్న 'నున్న'లో 'దేశానికి వెన్నెముక' సంతతిలో
పట్టపగలు వెన్నెలలో తడకలచాటున ఊడిపడ్డాడు-

నున్నరామయ్య అదృష్ట జాతకుడు
ఎన్నినోములఫలమో హాలికుడై పుట్టాడు
కర్షకుడంటే ఆషామాషీకాదు, ఇక్కడ
కృషీవలుడు పొందేగౌరవం తమాషాకాదు-

అనుదినమూ పిల్లలు అతనిగురించే పఠిస్తారు
క్షణక్షణమూ నాయకులతని పేరే స్మరిస్తారు
పాత్రికేయులు, చిత్రనిర్మాతలు చచ్చే మోజు కురిపిస్తారు
చిత్రకథలలో, చారిత్రకాలలో చివరికి రాజుగా మురిపిస్తారు

నిన్నటికి సున్నరామయ్య డెభ్భై సున్నలు చుట్టాడు
మన్ను మోస్తూనే చేను కాస్తూనే అరవై అవలీలగా దాటాడు
ఓపాత పెంకుటిల్లు, ఎకరంన్నర నేల, కాడిజత ముసలెడ్లు
దున్నపోతు, ముగ్గురు కొడుకులు, నల్గురు కూతుళ్ళు, స్థిరచరాస్తులు-

సున్నరామయ్య మహాజ్ఞాని, పరమతాత్వికుడు
శాలయోగ బోధనలు, బ్రహ్మంగారి తత్వాలు ఎవరోపాడగా విన్నాడు.
'గీత' చదవకపోయినా కర్మసిద్ధాంతం ఆకళింపుచేసుకున్నాడు
ప్రతిదానికి మన'ఖర్మ' అనడం సులువుగా నేర్చుకున్నాడు

సున్నరామయ్య జితేంద్రియుడు, అంగాలన్నిటినీ లొంగదీసుకొన్నాడు
ఆకలిరోగాలను, కోర్కెలగుణ్ణాలను అమానుషంగా భంగపరిచాడు
సున్నరామయ్య హృదయ వైశాల్యానికి కొలతలులేవు
అందర్నీ తేలిగ్గా క్షమిస్తాడు, ఎవర్నీ దేనికీ తూలనాడడు

సున్నరామయ్య అన్నిటికీ అతీతుడు, అల్పవిషయాలేవీ చేరువకురావు
దేశకాల పరిస్థితులు, రాజకీయ గతులు అతనిదృష్టినాకర్షించవు
సున్నరామయ్యలో మరో సుగుణముంది సున్నవిడిచి కదిలిరాడు
తానూ తనపనులుతప్ప ఇతర్లజోలికి పసేమిరాపోడు

పారతంత్ర్యము, స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యం, ప్రణాళికలు, గొట్టుమాటలు
ఏ బుర్రకథ, హరికథలముందో-వెనుకో తప్పక వినే ఉంటాడు
అయినా తనకు ప్రమేయంలేని పంకంలో పాదమిడ డేబుద్ధిమంతుడు
మన్నులోపుట్టి, మన్నులోపెరిగి, మన్నుకే అంకితమైన మహానుభావుడు

సున్నరామయ్య భక్తుడు-అతడు పూజించే దేవుళ్లు ముఖ్యంగా ముగ్గురు
పన్నుకట్టేందుకు పట్నం పోకుండానే పావలాతో సరిపెట్టేకరణం

అప్పోసప్పో ఇచ్చి పంటలదాకా భక్తుని ఓ కంట కనిపెట్టే కోమటి
జాతర్లకుగత్తెరలకు మందుమాకులు మంత్రతంత్రాలతో ఆదుకునేవాడనయ్య

నున్న రామయ్య నిరాడంబరజీవి-సాహసాలు, సౌకర్యాలు అతనికిగిట్టవు
మనిషి చందమామని మైలపరిచాడని తెలిస్తే అన్నం నీళ్ళుముట్టడు
'టెలీవిజన్లూ, రాకెట్లూ, జెట్లూ' ముచ్చట్లతనికి మనసున పట్టవు
'తెల్లోడిమాయ'కు మించిన మరోమాయతని మేధకు తట్టదు

రామయ్య ఆత్మస్తుతి ఎరగడు, ఎవరు పొగిడినా ఏమాత్రం సహించడు
ఏమైనా మూడుమార్లు తప్పలేదు, ఎవరో మండుటెండలో జెండాలతోవచ్చి
'రేడు'-'దేవుడు'-'తండ్రి'-'దాత' అంటూ కర్ణకఠోరమైన వర్ణనలు చేశారు
వద్దంటున్నా వినకుండా నిద్దరోతున్న మనుమణ్ణి పదేపదే ముద్దాడారు

నున్న రామయ్యకు కులవృత్తంటే ఎనలేని అభిమానం
రైతుకొడుకు రైతే అవ్వాలన్నది అతని నిశ్చితాభిప్రాయం
చిన్నతనంనుండే పిల్లల్ని పొలం పనులలో బాగా రాపాడాడు
చదువులు, పదవులు అంటువ్యాధులు సోకకుండా ముందే కాపాడాడు

## హెచ్చరిక

నున్న రామయ్య మామూలు మనిషి కాదు, మూలవిరాట్టు
ఎన్నోలక్షల వానపాములకతను ఆయువుపట్టు
నున్న రామయ్యలో చైతన్యం ప్రవహించిందంటే ఆటకట్టు
కనుక, నున్నరామయ్యను "నున్న"లో మన్నులోనే పాతిపెట్టు

## భరతవాక్యం/కర్తవ్యబోధన

నాలుగుకాలాలపాటు నున్న రామయ్యలందరూ చల్లగా వర్ధిల్లాలి
వెలుగే చీకటని, చీకటే వెలుగని మనమంతా మెల్లగా సర్ది చెప్పాలి
'ఆదర్శప్రాయుల'ని 'మార్గదర్శకు'లని 'అన్నదాత'లని అందలమెక్కించాలి
ఆధునిక పరిసరాలనీడ ప్రసరించకుండా అడ్డగించాలి

"చివరకు మిగిలేది"

# దయానిధి మనస్తత్వ పరిశీలన

—నవీన్

ఆధునిక తెలుగు వచన సాహిత్యంలో అతి నవీన మార్గం త్రొక్కిన రచయిత బుచ్చిబాబు. బుచ్చిబాబుకు ముందు ప్రచారంలో ఉన్న వచన సాహిత్యమంతా- ముఖ్యంగా కథ, నవల- కాల్పనికోద్యమంతో *(Romanticism)* ముడిపడినట్టిదే- తను నివసిస్తున్న సమాజాన్ని రచయిత నిరసించటం, తను నమ్మిన విధంగా తన కిష్టమైన విధంగా ఆ సమాజాన్ని సంస్కరించాలనే ఆవేశంతో వ్రాయటం- కాల్పనికోద్యమం యొక్క ముఖ్యలక్షణాలు రచయిత నమ్మిన కొన్ని అభిప్రాయాల్ని ప్రచారం చెయ్యటానికి. సాహిత్యం ఒక సాధనంగా ఉండేది. ఈ శతాబ్దపు మొదటి అర్థభాగంలో ఎంతో మందిని ప్రభావితం చేసిన ఇద్దరు ముఖ్యులైన రచయితలు- విశ్వనాథ సత్యనారాయణ గుడిపాటి వెంకటచలం. వీరిద్దరూ ప్రచారం చేసిన భావాల్లో ఎంతో తీవ్రమైన వైరుధ్యం కన్పించినా- స్థూలంగా వీరిద్దరూ వొకే తరగతికి చెందిన రచయితలు. ఇద్దరూ కాల్పనికోద్యమములో పుట్టి- రెండు విభిన్న మార్గాల్లో పయనించిన రచయితలు. సనాతన హైందవ ధర్మాన్ని పునరుద్ధరించాలని విశ్వనాథ, స్త్రీ స్వాతంత్ర్యం, లైంగిక స్వాతంత్ర్యం కావాలని గుడిపాటి వెంకటచలం కథలు, నవలలు వ్రాసారు. అంతేకాని కథని, నవలని కళాప్రక్రియలుగా వాళ్ళు భావించలేదు. నిజమైన కళ ప్రచారం చెయ్యదు. జీవితాన్ని చిత్రిస్తుంది. ఆ చిత్రణ ద్వారా వొక రసానుభూతిని కల్గిస్తుంది. వొక జీవిత సత్యాన్ని పాఠకుడిలో ఉద్దీపింపచేస్తుంది. ఆ చిత్రణ, ఆ రసానుభూతి, ఆ జీవితసత్యం-సమాజశ్రేయస్సుకు పరోక్షంగా ఉపకరించవచ్చు. బుచ్చిబాబు కథని, నవలని ఇలాంటి కళాప్రక్రియలుగా తీర్చిదిద్దిన మొదటి రచయిత.

బుచ్చిబాబు తన కథలద్వారా, నవల ద్వారా యేదోవొక, తనకు నచ్చిన భావాన్ని ప్రచారం చెయ్యటం ఆశయంగా పెట్టుకోలేదు. మానవ జీవితంలోని వొకానొక అంశాన్ని చిత్రించే కళా స్వరూపాలుగా వాటిని స్వీకరించాడు ఇది కాల్పనికోద్యమం తర్వాత తెలుగులో వచ్చిన ఆధునిక మార్గం. కాల్పనికోద్యమం నుండి తెలుగు సాహిత్యం యెక్కిన మరో మెట్టు.

ఇది ఆధునిక యుగం కాబట్టి ఈ యుగంలో వచ్చిన సాహిత్యమంతా ఆధునిక సాహిత్యం కాదు. ఆధునికరచయితలకి అంతర్ దృష్టి ప్రధానం. జీవితాన్ని స్థూలంగా కాదు- సూక్ష్మంగా పరిశీలించి, అనాదినుండి నేటి వఱకు మానవుడు వివిధ రంగాల్లో సాధించిన విజ్ఞానం ద్వారా వివిధ దృక్కోణాలనుండి చూడాలి. ఇదివఱకు రచయితలు తమ పాత్రలయొక్క బాహ్య జీవితం పై తమ దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించేవాళ్ళు 1. ఆధునిక రచయితకి వ్యక్తి బాహ్య జీవితం, బాహ్య చేష్టలు కాదు ప్రధానం- వ్యక్తుల ఆంతరంగిక జగత్తు ప్రధానం. వ్యక్తుల ఆంతరంగిక జగత్తులో యెన్నో శక్తులు పరస్పరం పోట్లాడు కుంటాయి- వొక వ్యక్తి బాహ్యచేష్టలకి ఈ ఆంతరంగిక జగత్తుతో సంబంధం ఉంది. వొక వ్యక్తి బాహ్య జీవితాన్ని అతని ఆంతరంగిక జగత్తు- ఆ జగత్తులోని భిన్న శక్తులకు కుదిరిన సమన్వయం నిర్ణయిస్తుంది. ప్రతీ వ్యక్తి తన ఆంతరంగిక జగత్తులో- అనగా తనలో తను వొక సమన్వయాన్ని కుదుర్చుకోవటం, బాహ్యప్రపంచంతో అలాంటి సమన్వయాన్నే కుదుర్చుకోవటంతో ప్రతీ వ్యక్తి నిజమైన శాంతి సౌఖ్యాలని సాధించగల్గుతాడు. ఆ సమన్వయం సాధించే వఱకు వ్యక్తి తనలో తను- బాహ్య ప్రపంచంతో యేదోరకంగా సంఘర్షణ పడ్తూనే ఉంటాడు ఆ సంఘర్షణని చిత్రించే ప్రయత్నం చేస్తారు ఆధునిక రచయితలు. ఈ ఆధునికోద్యమం 1914 తర్వాత ఆంగ్ల సాహిత్యంలో వచ్చింది. జేమ్స్‌జాయిస్, వర్జీనియా‌వోల్ఫ్, డి హెచ్ లారెన్స్ మొదలైన రచయితలు ఈ ఉద్యమాన్ని నడిపి ఎన్నో వినూత్న ప్రయోగాల్ని చేసి- ముఖ్యంగా నవలని గొప్ప కళాప్రక్రియగా తీర్చిదిద్దారు. సరిగ్గా ఈ ఉద్యమాన్నే 1940 తర్వాత తెలుగులో ప్రవేశపెట్టిన రచయితల్లో ముఖ్యుడు బుచ్చిబాబు. ఆయన వ్రాసిన నవల 'చివరకు మిగిలేది' తెలుగు ఆధునిక నవలా సాహిత్యంలో వొకమైలు రాయి.

'చివరకు మిగిలేది' బుచ్చిబాబు వ్రాసిన యేకైక నవల. పరవళ్ళు త్రొక్కే గొప్ప ఆవేశంతో, గొప్ప భావోద్వేగంతో వ్రాయబడిన నవల. తననికలవర పెట్టిన కొన్ని సమస్యలనుండి విముక్తి పొందటానికి ఈ నవల వ్రాసానని రచ

---

1. *'Modern Novel'* అనే వ్యాసంలో వర్జినీయా వూల్ఫ్ ఇలా వ్రాసింది: *'They have given us a house in the hope that we may be able to deduce the humanbeings who live there'*

యిత చెప్పుకున్నాడు 2 "చివరకుమిగిలేది" వ్రాసి పది సంవత్సరాలు వట్టి పోయాను" అన్నాడు బుచ్చిబాబు. 3 తనకి తాను ఏమిమిగలకుండా తన సర్వస్వాన్ని ఆ నవలకి అర్పించుకున్నాడు తన ఊహాశక్తిని, సృజనాత్మకశక్తిని, భావనా జగత్తుని సంపూర్ణంగా "చివరకు మిగిలేది"కి సమర్పించుకున్నాడు. బుచ్చిబాబు యింకో నవల వ్రాయలేక పోయాడంటే ఆశ్చర్యంలేదు. ఒక చోట సోమర్సెట్ మామ్ అన్నాడు "రచయిత తనకున్న సృజనాత్మక శక్తి అనే ఆస్తిని ఎంతో పొదుపుగా వాడుకోవాలి. ఒకేరచనలో ఆఆస్తినంతాఖర్చుపెడితే మరోరచనకు ఏమి మిగలదు!బుచ్చిబాబుతనకున్నఆస్తినంతా'చివరకుమిగిలేది'కి వ్యయంచేసాడు. పదిసం వత్సరాలువట్టిపోయాడు-రెండోనవలకీ యేమిమిగలకుండా-బుచ్చిబాబు లేఖినినుండి మరో నవలరూపకల్పన చేసికుంటుందని ఎందరు ఎంత ఆశించినా అందరికీ మిగిలింది 'చివరకుమిగిలేది'. రెండో నవలకి ప్రయత్నమే చెయ్యలేదు బుచ్చిబాబు.

నేటి వరకు వచ్చిన తెలుగు నవలలన్నింటిలోను ఉత్తమమైన బహుకొద్ది నవలల్లో 'చివరకు మిగిలేది' యెన్నతగింది 'కాల్పనికోద్యమం' నుండి బయటపడి క్రొత్త దారుల్ని త్రొక్కిన నవల. 'చివరకుమిగిలేది' 1943 లోనే వ్రాయబడినా, పుస్తక రూపంగా 1952లో వచ్చింది. నాటినుండి నేటివరకు ఎంతోమంది యువ రచయితల్ని, విమర్శకుల్ని ప్రభావితం చేసింది-చేస్తూనే ఉంది. విమర్శకులకు, పాఠకులకు తరిగిపోని ధనం 'చివరకుమిగిలేది'. ఎన్నిసార్లు చదివినా క్రొత్త అర్థా ల్ని, క్రొత్త ధ్వనుల్ని స్ఫురింపచేసే నవల 'చివరకుమిగిలేది'. యేదో వో కథావాన్ని పాఠకుడి మీద రుద్దటం కాకుండా జీవితాన్ని వివిధ దృక్కోణాలనుండి చూపెడుతుంది ఈ నవల. మానవుడు- తన అంతర్ బహిర్లోకాల్లో- తనతోతను- బాహ్యప్రపంచంతో సంఘర్షణ పడి ఆ రెంటికి సమన్వయం సాధించటాన్ని కళా త్మంగా చిత్రించే కళాఖండం 'చివరకు మిగిలేది'.

'చివరకు మిగిలేది' సులభంగా అర్థమయ్యే నవలకాదు. మామూలు నవలల్లో మాదిరిగా కథ కోసం, సంఘటనల కోసం చదివితే ప్రయోజనం లేదు. చాలా లోతుగా, అంతర్‌దృష్టితో చదివితేగాని నవలలోని సొగసు అర్థం ఔతుంది మొదటిసారి చదివినప్పుడు పాఠకుడు నవల పైపై మెరుగులతో తృప్తిపడే ప్రమా

2 "వ్యక్తిగతమైన విముక్తి ఈ నవలకి ప్రేరణ"
3 చూ. లత వ్రాసిన "మిగిలిందేమిటి" కి పీఠిక.

దం ఉంది. ముఖ్యంగా కళ్ళు జిగేలుమనిపించి, కళ్ళకి మిరుమిట్లుగొలిపే వర్ణనలు. ఉపమానాలు ఉక్కిరి బిక్కిరిచేస్తాయి. అలాగే జీవితాన్ని గూర్చి అతి నిశితంగా రచయిత చేసే (లేక దయానిధిచేసే) వ్యాఖ్యానాలు- పాఠకుడిని ఆపేసి తన్ను తాను పరిశీలించుకునేలా చేస్తాయి- ఈ వర్ణణలు, వ్యాఖ్యానాల ఉధృతంతో పాఠకుడు అసలు నవలని నిర్లక్ష్యంచేసి కేవలం వాటితోనే తృప్తిపడిపోయే అవకాశం ఉంది4. కాని నవలలో యే వర్ణనైనా, యే వ్యాఖ్యానమైనా పాఠకుడిని ఆకర్షించాలనీ, వర్ణనలకోసమే వర్ణించి నట్టుగా ఉండవు. ప్రతీ వర్ణన వెనుక, ప్రతీ ఉపమానం వెనుక, ప్రతీ వ్యాఖ్యానం వెనుక దయానిధి పాత్రపోషణ యిమిడి ఉంది. వాటి లోతుల్ని అవగాహన చేసికోవాల్సిన అవసరం పాఠకుడికి, విమర్శకుడికి ఉంది.

'చివరకు మిగిలేది' తీసికున్న వస్తువులోను, టెక్నిక్‌లోను క్రొత్త దనం ఉంది- వస్తువు మొదలే చెప్పినట్లు వొక వ్యక్తి అంతరంగం-దయానిధి 'అంతరంగ కథనమే' 'చివరకు మిగిలేది'. వొక పాత్ర 'అంతరంగాన్ని' చిత్రించటం వస్తువుగా తీసికొన్నప్పుడు- రచయిత తీసికొనే *Canvas* పరిమితంగా ఉండాలి- చాలా మంది పాత్రల్ని- సుదీర్ఘమైన కాలాన్ని- తీసికుంటే రచయిత అన్నిపాత్రల 'అంతరంగ కథనాన్ని' చెయ్యలేడు. అందువల్ల 'చివరకు మిగిలేది' తీసికొన్న *Canvas* వొక పాత్ర వరకే పరిమితం 'చివరకు మిగిలేది' *Canvas* దయానిధి అంతరంగిక జగత్తు- అందులోను- దయానిధి అంతరంగ జగత్తుని బాల్యం నుండి వృద్ధాప్యం వరకు చిత్రించదు- రచయిత 'సమర్పణ'లో చెప్పినట్లు "యే వ్యక్తి జీవితంలోను అన్నీ రసవత్తర ఘట్టాలుండవు. చాలాకాలం మామూలుగా జీవించి ఒక్క క్షణంలో మహత్తరమైన అనుభవాలకి గురికావచ్చు." అందు వల్ల చివరకు మిగిలేది ఆ 'ఒక్క క్షణాన్ని' ఆ 'రసవత్తరఘట్టాన్ని' ఆ 'మహత్తర సంఘటల్ని' తన *Canvas*గా తీసికుంటుంది. ఇలాంటి వస్తువుకి పూర్వపు నవలా టెక్నిక్ యే మాత్రం సరిపోదు- పూర్వపు నవలా శిల్పం పాత్రని బాహ్యంగా చూపటానికీ పనికొస్తుంది- పాత్ర అంతరంగాన్ని చూపించాలంటే- పాత్రయొక్క చైతన్య

---

4 ఇందుకు కారణం రచయితే చెప్పినట్లు 'ప్రథమ రచనలో కొంత పాండితీ ప్రకర్ష ఉంటుంది. తానుతెలిసికున్న విజ్ఞానాన్ని పాఠకుడికి తెలియ చెయ్యాలని రచయిత ఉబలాట పడతాడు.'

స్రవంతిని (*Stream of cansciousness*) చూపించాలి. పాఠకుడికి- పాత్రకి మధ్య యే తెరలు లేకుండా ఇద్దరికీ ఒౕక ప్రత్యక్ష సంబంధాన్ని కల్పించాలి. (పూర్వపు నవలా టెక్నిక్‌లో పాఠకుడికి పాత్రకి మధ్య రచయిత ఉండేవాడు.) అనుక్షణం మారే పాత్ర చైతన్య స్రవంతిని పాత్రే పాఠకుడికి ప్రత్యక్షంగా తెలియజేసే టెక్నిక్‌ని రచయిత సృష్టించుకోవాలి 5. ఈ టెక్నిక్‌నే *'Stream of canscioumess Technique'* అంటారు చివరకు మిగిలేది ఈ టెక్నిక్‌తో వ్రాయబడిన నవల. దయానిధి చైతన్యస్రవంతి యొక్క సమాహార రూపం 'చివరకు మిగిలేది' అనే నవల.

'దయానిధి' 'చివరకు మిగిలేది' యొక్క శరీరం-ఆత్మ-సర్వస్వమూను. మిగతా పాత్రలన్నీ దయానిధి చైతన్యంలో జనించి, ఆచైతన్యంలో అభివృద్ధి పొంది, ఆ చైతన్యంలో అంతమౌతాయి. మిగతా పాత్రలన్నీ-దయానిధి ఈ చైతన్యాన్ని-అంతరంగాన్ని-ఎలాప్రభావితం. చేసాయి అన్నదే ప్రధానం మిగతా పాత్రలన్నీ దయానిధియొక్క బాహ్యాప్రపంచానికి ప్రతీకలు. ఆ బాహ్యాప్రపంచం దయానిధి అంతరంగంమీద ఎలాంటిముద్రవేశాయో చూపించటానికి ఆ యితర పాత్రల సృష్టి జరిగింది. దయానిధి అంతరంగిక జగత్తులో- చైతన్యములో (లేక సుప్తచైతన్యంలో) స్థావరమేర్పఱచుకున్న యెన్నో పరస్పర వైరుధ్యంగల శక్తులు తమతోతాము ఎలా పరిష్కారం యేర్పరచుకున్నాయి-బాహ్యశక్తులతో ఎలా సమన్వయం కుదుర్చుకున్నాయో చూపించటం 'చివరకు మిగిలేది' లక్ష్యం 6. అలాగే "ఆర్థిక. సాంఘిక, చారిత్రిక వ్యత్యాసాలకు అతీతమైన మనిషిని, మనిషినీ బంధించివేసే మానవత్వాయొక్క శక్తుల్ని తఱచి" చూసే ప్రయత్నం ఈ నవలలో జరిగింది.

---

5 దీన్నే ఆంగ్లములో *'Free Association'* అని కూడ అంటారు.

6 ఆల్డస్ హాక్స్‌లీగూర్చివ్రాస్తూ బుచ్చిబాబు గొప్పనవలంటే యేమిటో ఇలాచెప్పాడు. 'తాను సృష్టించుకున్న సమాజంలో మానవుడు ఎట్లాఉన్నాడో చూపటమే నవలఉద్దేశ్యం. బాహ్యజగత్తులో శక్తులతో ఎలా సమాధానం కుదుర్చుకున్నాడు—తన అంతరంగ జగత్తులో జరిగే సంఘర్షణని ఎల్లా పరిష్కారం చేసికున్నాడు. ఈ రెంటినీ-బాహ్య అంతరంగ జగత్తులని సమగ్రంగా ప్రదర్శించిన నవల గొప్పనవల" భారతి-జనవరి, 1964

దయానిధి ఆధునిక మానవుడికి గొప్పప్రతినిధి. ఆధునిక మానవుడి సమస్యల్ని, విషాదాన్ని దయానిధిలో చూడవచ్చు-"ఆధునిక మానవుడు" అన టంలో ఉద్దేశ్యం పూర్వపు మానవుడిలా-దేన్నీ నమ్మలేని సందేహశీలత్వం-*(Scepticism)* ప్రతిదాన్ని-ప్రతిభావాన్ని-నిశితంగా వివిధరంగాల్లో మానవుడు సాధించిన విజ్ఞాన జ్యోతితో పరిశీలించి, వివిధ దృక్కోణాలనుండి తర్కించి యేది తేల్చుకోలేని సందిగ్ధంలో పడేతత్వం 7- సాంప్రదాయి సిద్ధమైన విలువ పట్ల విశ్వాసరాహిత్యం-ఇవికలిగిన మానవుడు 'ఆధునికమానవుడు'. దయానిధి ఈ తత్వాన్ని తనలో బాగా జీర్ణించుకున్న వ్యక్తి. గొప్పసందేహశాలి. ప్రతిదాన్ని నిశితంగా ఒక తాత్వికదృష్టితో చూసేవాడు. ఆధునిక విజ్ఞానాన్నంతా తనలో రూపొందించుకున్న మేథావి. గొప్పభావుకుడు. అతని మేధస్సుని ఎప్పుడూ ఏదో ఒకభావం పదును పెడ్తుంది. భావాల్లో ఊహాల్లో బ్రతకబోతాడు. జీవితానికి అర్థాన్ని తెలిసికోవాలనే తాత్విక జిజ్ఞాస కలవాడు. లోకంలోని యెన్నో విలు వల్ని పరిశీలించినట్లే తన్నుతాను నిశితంగా పరిశీలించుకునే ఆత్మజిజ్ఞాస కల వాడు. మనిషికి మనిషికి మధ్య సమాజం, చరిత్ర, సాంప్రదాయం, ఆర్థిక అస మానత్వం, మతం-మొదలైనవి కట్టిన తెరల్ని ఛేదించి-మనిషి మనిషినీ స్నేహ పాశంతో బంధించి వేసే మానవత్వం యొక్కశక్తుల్ని తలచి చూడాలనుకుంటాడు. అతి సన్నిత మనస్కుడు. అతి సులబంగా స్పందించే కవి హృదయుడు.

ఇలాంటి దయానిధి సుఖపడటానికి కావలసిన హంగులన్నీ ఉన్నా సుఖపడలేడు-తనతో తను-సమాజంతో ఘర్షణపడతాడు. సమాజంతో ఘర్షణ పడతాడేగాని సమాజానికి ఎదురు తిరిగిన *Rebel* కాడు దయానిధి. సమాజంలో నివసిస్తున్నాడు కాబట్టి ఆ సమాజంతో రాజీ చేసికోటానికి ప్రయత్నం చేస్తాడు అదంత సులబంగా సాధ్యంకాదు. సమాజంతో కాదు తనతో తను-తన అంత రంగంతో తను రాజీ కుదుర్చుకోలేక పోతాడు-తత్ఫలితంగా గొప్పవిషాదానికి గురౌతాడు-చివరకు తనతోతను-సమాజంతో రాజీపడటంతో దయానిధి తనవిషాదం నుండి బయట పడతాడు.

దయానిధి విషాదానికి సమాజం కాని లేక మరేయితర వ్యక్తి కాని

---

7 19వ శతాబ్దాన్ని *'Age of faith'* అని 20వశతాబ్దాన్ని *'Age of doubt'* లేక *'Age of reason'* అని అనటం విజ్ఞులకు తెలిసిందే.

కారణంకారు. దయానిధి విషాదానికి కారణం—సృష్టి దయానిధి అంతరంగిక జగత్తులో కొన్నిలోపాల్ని అమర్చింది. ఆ లోపాల కారణంగా అతని చేతన, అంతరంగం యెదగవలసిన విధంగా యెదగలేదు. కుంటువడిపోయాయి. అతని తల్లికి, అతనికి ఉన్న ఒక విపరీత సంబంధం ఇలాంటిదొక లోపం. ఈ కారణంగా అతని లైంగిక ప్రవృత్తి వికసించవలసిన విధంగా వికసించలేదు.

దయానిధి తల్లిపాత్ర నవలలో చిత్రించబడలేదు. కాని డాఫీ-డీ-మూరియర్ వ్రాసిన రెబెకా *(Rebecca)* నవలలో రెబెకాలా—నవలంతా ఆమె నీడ ఉంటుంది. దయానిధి హృదయం పొందే ప్రతీస్పందన వెనుక ఆమె ప్రేరణ ఉంటుంది. దయానిధికి అతని తల్లితోగల ఈ విపరీత సంబంధాన్ని సైకో-ఎనాలిసిస్‌లో *'Odepious Complex'* అంటారు *'Odepious Complex'* అనేది ప్రతీ వాళ్ళలోను కొద్దో గొప్పో ఉంటుందన్నాడు ఫ్రాయిడ్. తండ్రి అంటే హత్యచెయ్యాలనేంత ద్వేషం— తల్లిఅంటే ఆమె పూర్తిగా తనకే చెందాలనే విపరీత ప్రేమ—ఈ ప్రవృత్తియొక్క ముఖ్య లక్షణాలు. దయానిధిలో ఈరెండు ఉన్నాయి. దయానిధికి తండ్రంటే ద్వేషం. "మీకడుపున పుట్టినందుకు విచారించనిరోజులేదు" అంటాడు తండ్రితో-తల్లిఅంటే విపరీతమైనప్రేమ దయానిధికి. తల్లివిషయంలో అతి సున్నితంగా ప్రవర్తిస్తుంటాడు. తల్లి విషయం ఎవరు చెడుగామాట్లాడిన అతిదారుణంగా బాధపడతాడు. అలామాట్లాడిన వాళ్ళని ఎన్నడూ క్షమించలేదు.

"జెర్ సొప్పా, నయాగరాజలపాతాలు, హిమాలయా పర్వతాలు, సింధూ భాగీరథీ నదులు—వీటికిమల్లే తల్లి ఎప్పుడూ ఉండిపోతుంద"నుకున్నాడు. తన తల్లిమరణిస్తే 'నక్షత్రమండలం కూలిపోతుంది సముద్రాలుపొంగి లోకాన్ని ముంచివేస్తాయి. భూమివిడిపోయి లోకాన్ని మింగేస్తుంది'—తల్లికి ఫిట్స్‌వచ్చే ఒక జబ్బుంది. ఆజబ్బుని నయం చేద్దామనే దయానిధి మెడిసిన్ చదువుతున్నాడు. కాని దయానిధి మెడిసిన్ పూర్తయ్యేలోగానే దయానిది తల్లి మరణిస్తుంది. దయానిధి క్రుంగిపోతాడు-'ఇంతవరకూ అతనికి వేరే ఉనికిలేదు. ప్రతిచిన్న విషయానికి తల్లిమీద ఆధార పడ్డాడు. డబ్బుకావలిసి వస్తే తల్లిచేత నాన్ననడిగించాల్సిందే-ఈ సంఘం ఒక సముద్రం ఐతే అతను నిలబడేందుకు అమ్మ ఒక లంగరు. ఇప్పుడు ఆ లంగరు లేదు ఏదోశక్తి అతన్ని వదలిపోయింది. అతన్ని ప్రపంచానికి బందించిన గొలుసులో గొళ్ళెం వూడింది.........

శక్తి, బలం, సంతోషం, ఆదర్శం అన్నింటిని అమ్మ తీసుకు పోయింది; అంతా ఐపోయింది. చివరకు మిగిలింది తను" అని వాపోతాడు దయానిధి.

దయానిధి తనతల్లిని ఇంత గాఢంగా ప్రేమిస్తున్నా – సమాజంలో ఆ తల్లిని గూర్చి నానాకథలు–చాలానీచమైన కథలు- ఆమెశీలం మంచిది కాదని-ఎప్పుడో తప్పుచేసిందని–చెప్పుకుంటారు. అతనికి కావలసినవాళ్ళు, అతనిబంధువులు కూడా అకథల్ని ప్రచారంచేసి దయానిధిని హింసిస్తుంటారు. దయానిధి చేసిన ప్రతీ పనిని అతని తల్లితో ముడివేసి, ఆపనికి క్రొత్తఅర్థాలు, క్రొత్త ఉద్దేశ్యాలు కల్పిస్తుంటారు. దయానిధికి, కోమలికిఉన్న సంబంధాన్నిగూర్చి వ్యాఖ్యానిస్తూ "దాని కడుపున పుట్టావు కాబట్టే నీ కీ బుద్ధులొచ్చాయి" అంటాడు తండ్రి దశరథ రామయ్య.

"మీ అమ్మ బుద్ధులెక్కడికి పోతాయ్-నీ కట్లాంటి వాళ్ళేనచ్చుతారు" అంటుంది సుశీల-అప్పట్లో దయానిధికి కాబోయె భార్య-

దయానిధి ఈ మానసిక హింసని భరించలేక పోతాడు. అతనికి మనుష్యజాతంటేనే అసహ్యం, భయం యేర్పడతాయి-తనేం చేసినా ప్రపంచం తప్పు పడ్తుందనే దోషి మనస్తత్వం.– *(Guilt Consciousness)* పాపభీతి *(Sense of sin)* అతనిలో అభివృద్ధి చేసికుంటాడు. అతడు ప్రపంచాన్ని అందరిలా చూసి, అందరిలా ఆ ప్రపంచంలో యిమిడిపోలేకపోతాడు. అతని అంతరంగానికి-బాహ్యప్రపంచానికి వొక వైరుధ్యం యేర్పడుతుంది. బాహ్య ప్రపంచంలో ఎవరితోనైనా సంబంధంపెట్టుకోవటానికి జంకుతాడు-తనలో తను, తనతో జీవించే *'Introvert'* అయి పోతాడు.

తల్లిమీది అతని గాఢమైన ప్రేమ *(Odeipous Complex)* కారణంగా అతని లైంగిక ప్రవృత్తిలో *(Mother fixation)* తల్లిరూపం స్థిర పడ్తుంది. ఈ కారణంగా ఇతర స్త్రీలతో దయానిధి సహజమైన లైంగిక సంబంధాన్ని పెట్టుకోలేకపోతాడు-కోమలిని ప్రేమిస్తాడు-కాని ఆమెతో లైంగిక సంబధాన్ని పెట్టుకోవటానికి జంకుతాడు–సుశీలని ద్వేషిస్తాడు-ఇందిరని పెళ్ళిచేసుకున్నా శోభనం నాటిరాత్రి తప్పించుకు పారిపోతాడు. ఒక్క అమృతంతోతప్ప-(అమృతం అతని తల్లి రూపానికి చక్కగా సరిపోయింది కాబట్టి) యే స్త్రీతోను

దయానిధి సహజంగా ప్రవర్తించలేదు.

ఈ *Odeipious Complex* కారణంగా సెక్స్ అంటే భయమే కాకుండా, యేదో పాపమనే పాపభీతి కూడా *(Sense of Sin)* దయానిధిలో వేరుకుపోతుంది. యేపని చేస్తున్నా యేదో తప్పుచేస్తున్నాననే చైతన్యం దయానిధిలో ఎప్పుడూ ఉంటుంది 8. యేదో తప్పు చేస్తున్నామనే ఈ చైతన్యానికి *'Odepious Complex'* కి సంబంధం ఉందన్నాడు ఫ్రాయిడ్ 9 - దయానిధికి అతని తల్లిపై ఉన్న అపారమైన ప్రేమలోకూడ ఈ తప్పుచేస్తున్నాననే చైతన్యం ఉంది.

తనతల్లి శీలాన్ని గూర్చిఎవరైన ఆక్షేపించినప్పుడు దయానిధి వెంటనే చాలా ఉధృతంగా స్పందించాడు. తన తల్లిశీలాన్ని తప్పుపట్టే వాళ్ళంతా స్వార్థపరులు, కుటిల మనస్కులు. ఎదుటివాళ్ళని హింసించాలనే అమానుష ప్రవృత్తి కలవాళ్ళని దయానిధికి తెలుసు. క్లబ్బులో సోమయ్య అనేవాడు దయానిధి తల్లిశీలాన్ని గూర్చి, దయానిధినిగూర్చి నీచంగా మాట్లాడినప్పుడు దయానిధి ఆ సోమయ్య యేమిటో తనలోతను ఇలా వ్యాఖ్యానించుకుంటాడు. 'సోమయ్య అల్పుడు. సోమయ్య వ్యక్తిత్వంలేని మనిషి, సంఘంలో వొక రేణువు. సాంప్రదాయం కాళ్ళక్రింద బురద. దులుపుతే వొదల్దు' కాని ఇలాంటి సోమయ్య లాంటివాళ్ళమాటల్ని లెక్క పెట్టకుండా ఉండలేదు దయానిధి. వాళ్ళమాటలకి

---

8 స్నానంచేస్తున్న కోమలిని తలుపు సందులోంచి చూసి దయానిధి ఇలా అనుకుంటాడు. "ఏదో నేరం చేసినవాడిలా చిన్నబుచ్చుకున్నాడు. అతని వెనకాల తలుపు సందులోంచి అతను ఇల్లాచూడటం మరోరుచూస్తే ఎలా వుంటుంది? మనల్ని ఎవ్వరూ చూడటం లేదన్న ధైర్యం ఉన్నప్పుడు ఎన్నో పన్లు చేస్తాము ఎవరైనా చూస్తే ఎలా ఉంటుందో ఊహించుకొని అవకాశం ఉన్న ఆ పన్లు చెయ్యటానికి జంకుతాము తలుపుసందు నీతి మనది"

9. *Sigmund Freud: A General Introduction to Psyco-Analysis "There is no possible doubt that one of the most important sources of guilt which so often torments neurotic people is to be found in odepious complex." P. 341*

గుండెలు పగిలేలా బాధపడతాడు. దయానిధి సోమయ్య లాంటి వాళ్ళమాటల్ని వెంటనే నమ్మిబాధపడటానికి కారణం-వాళ్ళంతా దయానిధి సుప్త చైతన్యంలో-అందరిలాగ - తన తల్లి పై - ఆమె శీలాన్ని గూర్చిన శంక - అనుమానం-ఆ అనుమానం కారణంగా తల్లిఅంటే ద్వేషంకూడా దయానిధి అంతరాంతరాల్లో అతనికి తెలియకుండా స్థావర మేర్పఱచుకొంది. తల్లి శీలాన్ని గూర్చిన అనుమానం తనలోకూడ ఉందని దయానిధికి తెలియదు. అదే ఎదుటివాళ్ళ నోట విన్నప్పుడు-తనలోతనకి తెలియకుండా దాగివున్న అంశాన్నే ఎదుటి వాళ్ళల్లో చూస్తాడు-వెంటనే నమ్ముతాడు-కాని వాళ్ళతోకలిసి వాళ్ళలాగే తన అమ్మని దూషించలేడు-(అతని తండ్రి, అన్న ఆపని చేసారు) అలా అన్నవాళ్ళని ద్వేషించి, బాధపడి-తనుకూడ వాళ్ళల్లో వొకడు కాదనుకొని తనను తాను ఓదార్చుకుంటాడు. ఇలా తల్లిమీది అతని అపారమైన ప్రేమ అతని అంతరాంతరాల్లో అమ్మపై ఉన్న ద్వేషాన్ని అణగద్రొక్కటానికి తోడ్పడుతుంది (*Repression*). ఈ కారణంగా తల్లిపై దయానిధికి గల ద్వేషం బయటకొచ్చే మార్గం లేకపోతుంది (*Outlet*) దయానిధి విషాదానికంతటికి అతని అంతరంగంలోని ఈ వైరుధ్యం కారణం.

కాని దయానిధి గొప్ప ఆత్మజిజ్ఞాస గల మేధావి. తన్ను తాను అర్థం చేసికోవటానికి, తనలోని తనను వొక తత్త్వవేత్తలా నిశితంగా పరిశీలించుకోవటానికి నిరంతరం ప్రయత్నిస్తుంటాడు. క్రమక్రమంగా దయానిధి తనఅంతరంగంలోని వైరుధ్యాన్ని అవగాహన చేసికుంటాడు, తననుతాను షేక్స్పియర్ సృష్టించిన హామ్లెట్‌లో చూసికుంటాడు. హామ్లెట్ పాత్ర అతనికి జోలెడు మానసిక ఉపశమనాన్ని కల్గిస్తుంది "హామ్లెట్" నాటకాన్ని గూర్చి వొక వ్యాసం రాస్తాడు. ఆవ్యాసం ద్వారా తన్ను తాను తెలిసికొనే ప్రయత్నం చేస్తాడు. హామ్లెట్‌ని గూర్చి దయానిధి యిలారాస్తాడు.

"హామ్లెట్ తల్లిని అందరు పురుషులలాగే మాతృదేవతలా ఊహించి గౌరవించి ప్రేమించాడు. కాని ఆమెభర్త చనిపోగానే మళ్ళావివాహం చేసికుంటుంది. ఈ కృత్యంతో హామ్‌లెట్ తన తల్లినిపూజించలేక పోతాడు తర్వాతభర్త జీవించి ఉండగావే భర్తసోదరుడితో వ్యభిచరించిందన్న సంగతి తెలియగానే ఆమెను గౌరవించటం మానేస్తాడు. స్త్రీని చాంచల్యమా అని సంబోధించాడు. చంపడానికి నిశ్చయించాడు........

కాని ప్రేమించకుండా ఉండలేక పోయాడు"

ఇంచుమించు ఇట్లాంటిదే దయానిధి సమస్య తల్లిని ప్రేమించాడు-పూజించాడు-కాని ఆమెశీలం మంచిదికాదు-వ్యభిచరించింది. ఇది తెలిసినప్పు దయానిధి తల్లిని ద్వేషించకుండా ఉండలేకపోయాడు. ఈ విషయం దయానిధి షేక్స్పియర్‌ని గూర్చి వ్రాసినప్పుడు యింకా స్పష్టం ఔతుంది హామ్‌లెట్ పాత్ర సృష్టిలో షేక్‌స్పియర్ వ్యక్తిగత చరిత్రకొంత యిమిడి ఉందని నమ్మిన దయానిధి యిలా వ్రాస్తాడు.

"షేక్‌స్పియర్, చెడ్డదైన తల్లిని ప్రేమించగల్గాడు కాని ఈ ప్రేమ అమెలోని 'చెడ్డతనాన్ని' సమన్వయం చెయ్యలేక పోయాడు."

సరిగ్గా దయానిధికూడా యింతే-చెడ్డదనుకునేతల్లిని ప్రేమించ గల్గాడు. కాని తనప్రేమని ఆమెలోని 'చెడ్డతనాన్ని' సమన్వయం చెయ్యలేకపోయాడు. ఈ వ్యాసం వ్రాయటంతో దయానిధికి ఏదోబరువు తగ్గినట్లనిపించింది-తన చేతనలో అణచుకొన్న కొన్నింటిని బయటకు రప్పించి ఆ వ్యాసంద్వారా వాటికి *Outlet* కల్పించాడు-అతని సమస్య విశదపడింది-విశదపడిన వస్తువుయికబాధించదు.

ఇది జరిగాక దయానిధి రాయలసీమకు వెడతాడు - చిత్రంగా భాగ్యవంతుడై పోతాడు-క్రొత్తజీవితాన్ని, క్రొత్తవ్యాసంగాల్ని ప్రారంభిస్తాడు ఐతే అక్కడా అతన్ని అతని తల్లి వెంటాడటం మానదు. ఎవరో దయనిదికి తెలియని వాళ్లు ఒకచోట కూర్చొని మాట్లాడుకుంటున్నారు.

'ఆరమ్మా యిదేమాదిరట-బల్లకట్టుకొని సంపాదించినదుడ్డే-' అంటాడు వాళ్లల్లో ఒకడు

'అమ్మబుద్ధులే కొడుక్కి వచ్చాయా?' అంటాడు మరొకడు.

దయానిధి ఈ మాటలు వింటాడు. వెంటనే వాళ్లమధ్యలోకి వెడతాడు

'నేను నిజంగా మీకు చేసిన అపకారం యేమిటో చెబుతారా?' అని అడుగుతాడు.

'నేను సర్కారు జిల్లావాణ్ణనా మీకు కోపం'

సమాధానం లేదు-

'అదే అయితే రేపుదయమే వెళ్ళిపోతున్నాను'

'నాకు పెళ్ళికాలేదనా... రేపుదయమే పెళ్ళిచేసికుంటాను.'

'ఎవరో మా అమ్మ విషయంఎత్తారు మీలో-నేనేం చెయ్యను-మా అమ్మ చచ్చిపోయింది-చచ్చిన వాళ్ళని నేనేం చెయ్యను'.

ఒక్కసారి కళ్ళమ్మట నీళ్ళుతిరిగాయి- కంఠం పగిలిపోయింది. ఆపుకోలేక నిధి బిగ్గరగా యేడుస్తూ 'చచ్చిపోయింది' అనుకుంటూ పిచ్చివాడిలా నడిచి వచ్చేసాడు."

ఇది—మొదటిసారిగా దయానిథి సమాజంతో రాజీ చేసికోవటానికి చేసిన ప్రయత్నం. దయానిథి వ్యక్తిగా సంఘానికి లొంగిపోయిన దృశ్యం- ఆ సంఘాన్ని తృప్తిపరచటానికి యేమైన చేస్తానన్నాడు-కాని తల్లి చచ్చిపోయింది. చచ్చిపోయినవాళ్ళని యేం చెయ్యగలం-"మా అమ్మ చచ్చిపోయింది-చచ్చిపోయింది." అనటంలో దయానిధి అంతరంగంలో ఇంతకాలం పేరుకొనిఉన్న ద్వేషం కట్టలు త్రెంచుకొని ప్రవహించింది. "చచ్చిపోయినవాళ్ళని నేనేం చెయ్యను" అనటంలో అమ్మమీద తను పగతీర్చుకోలేని నిస్సాహాయత్వం కన్పిస్తుంది. అమ్మ బ్రతికుంటే యేమైనా చేసేవాడు (హామ్‌లెట్‌లా చంపేవాడేమో) కాని అమ్మ చచ్చిపోయింది. చచ్చిపోయి తనని సాధిస్తోంది. బాధిస్తోంది - ఇలా అమ్మమీది ద్వేషం బయటకు రావటంతో దయానిధికి నిజమైన విముక్తి లభిస్తుంది ఈ దృశ్యానికి ముందే దయానిధి తల్లి విగ్రహాన్ని ఎవరో పగులగొట్టారు. అతని అంతరంగంలో ప్రతిష్టించుకున్న వొకానొక తల్లి రూపంకూడా పగిలిపోయింది తనిక ఆ రూపానికి బానిసకాడు. ఆ సంకెళ్ళనుండి బయటపడ్డాడు - ప్రపంచాన్ని క్రొత్త దృష్టితో చూస్తాడు- ఇంతకాలం తన చుట్టూవున్న వ్యక్తులు తనని ద్వేషించటానికి కారణం- తనకు తన తల్లిపైగల ఆ అపారమైన ప్రేమ- అందువల్లసమాజం తనను ద్వేషిస్తోంది-తల్లి చెడు శీలాన్ని ఆధారం చేసుకొని- అనుకున్నాడు దయానిధి కాని ఈ దృశ్యం తర్వాత సమాజం తనని ద్వేషించటానికి కారణం తన తల్లి శీలం కేవలం వొకసాకు—నిమిత్తమాత్రం-మానవుడు ద్వేషించటానికి నిజమైన కారణం "తనకేం కావాలో తెలీనప్పుడు మానవుడు ద్వేషిస్తాడు" అని తెలిసికుంటాడు—ఇలా తల్లి రూపంనుండి బయటపడి, తన్నుతాను, ప్రపంచాన్ని క్రొత్త వెలుగులో చూసి, తన్నుతాను స్వీకరించుకొని, ప్రపంచాన్ని స్వీకరిస్తాడు దయానిధి

తల్లితర్వాత దయానిధి అంతరంగాన్ని గాఢంగా ప్రభావితంచేసింది

కోమలి. కోమలి సౌందర్యం దయానిధికొక *Obsession* ఔతుంది. దయానిధిలో గొప్ప కవితావేశం, సౌందర్య దాహం ఉన్నాయి- కోమలి దయానిధిలోని కవితావేశానికి, సౌందర్య దాహానికి బాహ్యరూపంగా కన్పిస్తుంది. కోమలి సౌందర్యాన్ని వర్ణించటంతో తృప్తిపడతాడేగాని, ఆమెని శారీరకంగా అనుభవించటానికి జంకుతాడు—దయానిధికి సెక్స్ అంటే భయం, జుగుప్సా యేర్పడ్డాయి. కోమలిని కేవలం తన అంతరంగంలో ప్రతిష్ఠించుకొని ఆమె సౌందర్యాన్ని గూర్చి కలలు కంటూ ఆమెపై తనలోని లైంగికవాంఛని ఉత్కృష్టంచేసికొని *(Subtimation)* తృప్తిపడతాడు ఈ *Subtimation* దయానిధిలో ఉత్కృష్టమైన కవితావేశంగా, దహించివేసే సౌందర్య దాహంగా పరిణమిస్తుంది.

"యుగ యుగాలుగా పెరిగి రంగు పంగించుకొని పుష్పించిన రోజా పుష్పం కోమలి అధరాలు- యుగ యుగాలుగా కొండ శిఖరాలపై మంచు కురిపించి మత్తెక్కిన చంద్రబింబాలు కోమలి నేత్రాలు- అనంతంనుంచి ప్రళయంలో ఉద్భవించి మూగదైపోయిన ప్రపంచం రోద కోమలి కంఠధ్వని"—ఇలా ఊహించుకుంటాడు కోమల్నిగూర్చి - ఇంతేకాదు-కోమలికి తనకి వొక అస్పష్టమైన దైవత్వాన్ని, జన్మ రాహిత్యాన్నికూడా ఆపాదించుకుంటాడు దయానిధి.

"మరో ప్రపంచంలో వారిద్దరూ వొక శరీరమే - ఇక్కడెందుకో విడిపొయ్యారు. తను నశించి ఆమెలో ఐక్యం కావాలంటే ఇద్దరూ కైలాసపర్వతంపై నుండి పారే మంచు నదిలోపడి కొట్టుకుపోయి హతమవాల"ట.

తనకు కోమలిపైగల యింత ప్రేమ పవిత్రమైన ప్రేమకాదని దయానిధికి తెలుసు కోమలి శరీరాన్ని అమ్ముకునే వేశ్య. తన అంత మహోత్కృష్టమైన ప్రేమకి బదులు యేమి యివ్వలేని అతి సామాన్యస్త్రీ కోమలి. కాని కోమలి లేకుండా బ్రతకలేననుకుంటాడు దయానిధి

"పవిత్రతతో పొంగిపొరలే ప్రేమకాదది—కవులు మురిసిపోయి పాడుకునేందుకు సంఘటించిన కలయిక కాదు-అదొక జబ్బు-జాడ్యం—దానికెవ్వరూ బాధ్యులుకారు పెద్దలు, నీతి మర్యాద, ఔచిత్యం,సంఘం—వీళ్ళెవరినీ సాధించకూడదు. ఆ శక్తి అతనిలో పుట్టి ఆమెలోనే అంతమొందాలి" అనుకుంటాడు దయానిధి.

కోమలి వేశ్య. డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకొనేస్త్రీ–విద్యా సంస్కారాలు లేని సామాన్యురాలు–దయానిధి మేధావి–గొప్ప సంస్కారంగల వ్యక్తి–అలాంటి దయానిధి కోమల్ని విడిచి బ్రతకలేననేంత వెర్రిగా ఎందుకు వాంఛిస్తాడు? "ఈ ప్రశ్నకు సమాధానం తెలిస్తే జీవిత రహస్యమే తెలిసిపోయేది" అంటాడు దయానిధి.

కోమలిని దయానిధి అంత విపరీతంగా వాంఛించడానికి కారణం దయానిధికి, దయానిధి తల్లికి ఉన్న సంబంధం–*Odeiptious Comlex*. దయానిధి కోమలిలో తన తల్లిని చూసిఉంటాడు–కోమలి సంఘంచేత వేశ్యగా వెలివేయబడింది–దయానిధి తల్లినికూడా సమాజం వెలివేసింది – అలాగే కోమలితో దయానిధికున్న సంబంధాన్ని అందరూ గర్హించారు—అతని తల్లితప్ప. "కోమల్ని వర్ణిస్తుంటే అర్థమైపోయినట్లు తల పంకించింది అమ్మ" కోమలికోసం పడేబాధ అమ్మకి తెలుసు రక్తం చెబుతుంది. హృదయంతో అర్థం చేసికుంటుంది. తప్పుని దండించదు. సరేనంటుంది. ప్రపంచంలో అందరికీ అమ్మలా అర్థంచేసికునే గుణం ఉండకూడదు? అమ్మనే "సంఘం ఏమంది? హృదయం ఉన్నవాళ్ళని సంఘం దూషిస్తుంది సంఘం కోరేది మానవుడి ఆనందం. క్షేమంకాదు. అది కోరేది నమ్రతా, వినయం–మనకి లేని అనుభవం, ఆనందం యితరులకెందుకు? అనుకొని సంఘం వాటి వినాశానికి దారితీసే ద్వారబంధాల్ని నిర్మాణం చేస్తుంది." ఇలా వ్యాఖ్యానించుకుంటాడు దయానిధి సంఘ ద్వేషానికి బలియైన వ్యక్తులుగా తనకి, కోమలికి, అమ్మకి వొక సామ్యాన్ని, సమన్వయాన్ని కల్పించుకుంటాడు. తనకు కోమలికి ఉన్న సంబంధాన్ని సమాజం తన తల్లితో ముడిపెట్టడం దయానిధికి కోమలిపట్ల ప్రేమని అధికంచేస్తుంది–అమ్మని వెనకేసుకొనివచ్చినందుకు దయానిధి తండ్రి ఇలా అంటాడు.

"అవును మరి–అమ్మని వెనకేసుకున్ని రాకపోతే కామాక్షి కూతురుతో (కోమలి) నీ ఆటల్లా సాగుతాయి........ నీ ఆటల్ని సాగనిస్తూ, నీ కన్ని యేర్పాట్లు చేసిపెడుతుంది–దాని ఆటలకి నువ్వు మద్దతవుతావు"

అయితే కోమల్ని దయానిధి—అవకాశం ఉన్నా శారీరకంగా అనుభవించలేక పోతాడు. అతనిలో సెక్స్ అంటే పేరుకుపోయిన పిరికితనాన్ని, జుగుప్సని కోమలి పోగొట్టలేకపోయింది. కోమలికి దయానిధిని అర్థంచేసుకునే సం

స్కారంలేదు. అతన్ని ప్రేమించి, ఆదరించి, అతన్లోని సెక్స్‌పట్లగల భయాన్ని కోమలి పోగొట్టగలదు. కాని కోమలికి దయానిధిని ప్రేమించి ఆదరించే టీపిక, విద్య, సంస్కారంలేవు. అందువల్ల దయానిధి కోమల్ని దూరంగాచూసి వాంఛి స్తాడు—ఆమెమీది తన వాంఛన్ని ఊహల్లో, ఆలోచనలో తీర్చుకొని తృప్తిపడతాడు– "భాష, భావాలు, ఊహ ఉండబట్టిగాని లేకపోతే మూగబాధ ఎంత చెడ్డది. ఊహించుకొని తృప్తిపడకపోతే వాంఛ మనిషిని హరించివేస్తుంది" అనుకుంటాడు దయానిధి.

కోమలికి తన శరీరాన్ని వాంఛించి డబ్బురూపేణా అందుకు ప్రతిఫలం ముట్టచెప్పే వాళ్ళు తప్ప దయానిధిలాంటివాళ్ళు అర్థంకారు– కోమలి అలాంటి వాతావరణంలో, అలాంటి పరిస్థితుల్లో పెరిగింది. ఇది దయానిధిని కృంగదీస్తుంది. తనది ఉత్కృష్టమైన ఆదర్శ ప్రేమ అనుకుంటాడు కోమలి డబ్బు అడగటంతో ఆ భ్రమ తొలగిపోతుంది. చివరకు తెగించి డబ్బు తీసికొని ఆమెను శారీరకంగా అనుభవించటానికి వెడతాడు– కోమలి అతనికోసం ఎదురుచూసి యేకాంతంగా నిద్రపోయింది– అన్ని అవకాశాలు ఉన్నాయి కాని దయాన్నిధిలో సెక్స్‌పట్ల ఉన్నభయం, జడత్వం అతన్ని ఆమె శరీరాన్ని తాకకుండా చేస్తాయి– యేదోశక్తి అతనిలో ప్రవేశించి కార్యశూన్యుణ్ణి చేస్తుంది– ఆమెశరీరాన్ని అనుభవిస్తే ఆమె సౌందర్యాన్నిగూర్చి అతి ఉన్నతంగా ఊహించుకొన్న తన ఊహలన్నీ పటాపంచలౌతాయని దయానిధి భయం. గొప్ప ఊహల్లో బ్రతికేవాడు అసలు కార్యాన్ని చెయ్యలేడు.

"అతనికి భయమేసింది– సౌందర్యాన్ని యెదుర్కొన్న మనిషి అతడు. గొప్ప సౌందర్యం అనుభవంకాదు–గొప్పసౌందర్యంఅంటుబడిపోవటంకాదు ఎల్లప్పుడూ అవుతూందటం హద్దులులేనిది అనుభవం–గొప్పసౌందర్యానికిహద్దులేవు–రెండింటికీశరీరం హద్దులుకాదు – కాకూడదేమో – శరీరం మరొకశక్తి – విడిపోయిన ఆ అనుభవానికి హద్దుల్లేవు... ..ఆ అనుభవం అతనికి అక్కర్లేదు–అనుభవానికి హద్దుల్లేవు''

సౌందర్యాన్ని, శరీరాన్ని విడివిడిగా చూసి తనకీసౌందర్యమే కావాలని, ఆమె శరీరం అక్కర్లేదని వెళ్లిపోతాడు దయానిధి. నిజానికి కోమలి సౌందర్యమంతా దయానిధిహృదయంలో ఉన్నదే–అతడు ఊహించుకున్నదే– నిజంగావున్నది కోమలి శరీరమే– కాని ఆ శరీరాన్ని తాకితే అతనిలో ఆమెపై ఊహించుకున్న సౌందర్యం పోతుందని దయానిధిభయం– కోమలి శరీరానికి కావల్సిందిడబ్బు.

ఆమె తలగడ క్రింద తనుతెచ్చిన ఐదువదిరూపాయిల నోట్లు పెట్టటంతో దయానిధికి కోమలిశరీరంపైగల అసహ్యం వ్యక్తం ఔతుంది. కోమలికి డబ్బుకావాలి- అది తప్ప యింకేమి అర్థంకాదని దయానిధి తెల్పుకున్నాడు. ఆమె సౌందర్యంపయి గల ఆరాధనని తనలోనే నింపుకొని- ఆమెకు దూరంగా వెళ్ళిపోతాడు. కోమలికి డబ్బు యివ్వడంతో కోమలిపైగల వొకానొక అనుబంధాన్ని దయానిధి త్రెంచుకున్నాడు- డబ్బు అతిలౌకికమైన విలువలకి చిహ్నము. కోమలి దయానిధినుండి కేవలం ఆ డబ్బేకోరింది- కోమలిపై తనప్రేమ అలౌకికమని భావించిన దయానిధికి ఇది భరించరానిదౌతుంది కోమలికి తనకి ఇక పొసగదని- కోమలికి డబ్బు ఇవ్వటంతో-దయానిధి తేల్చుకున్నాడన్నమాట- ఆమెకి దూరంగా వెళ్ళిపోయి ఆమెను మఱచిపోవటానికి ప్రయత్నిస్తాడు——

తిరిగి చాలా కాలానికి-చాలా అనుభవాల తర్వాత దయానిధి, కోమలి కలిసికుంటారు ఇప్పుడు కోమలి దయానిధికి పూర్వంలావొక *obsession* కాదు_ ఆ యౌవనోద్ధృతం, ఆ కవితా వేశం, ఆ భావోద్వేగం తగ్గాయి కోమల్ని నిర్వికారంగా చూస్తాడు ఒకప్పుడు అతన్ని దహించి వేసిన సౌందర్యజ్వాల కోమలి- కోమలికి ఇప్పుడా సౌందర్యంలేదు ఆసౌందర్యాన్నంతా ప్రపంచానికిపంచిపెట్టింది. కోమలిలో పూర్వపు సహజ సౌందర్యం పోయింది.

"సహజమైన ప్రకృతిలోని చెట్లను కొట్టించేసి, మొక్కలు గడ్డి పీకించేసి ఎవరో భార్థానాలు నిర్మించినట్లుగా' ఉంది కోమలిప్పుడు. 'అత్తరు తయారీ కోసం ఎవరో రసాన్ని... ... అందాన్ని పిండి పారేసిన గులాబి పుష్పంలా'' కన్పించింది కోమలి దయానిధికి

కోమల్ని చూడగానే దయానిధిలో జనించిన భావం- ఆమెశరీరాన్ని పూర్తిగా మలినం చేసికొని వచ్చిందని-"ఆ సౌందర్యమంతా ప్రపంచానికి పంచి పెట్టి తనకేమివ్వడానికి వచ్చింది కోమలి?'' అని ప్రశ్నించుకుంటాడు దయానిధి- పూర్వం కోమలికి కనీసం సౌందర్యమైనా ఉంది-ఇప్పుడా సౌందర్యంకూడ కోమలికి లేదు-కోమలి తనకిప్పుడు యేమి యివ్వలేదు.

కాని కోమల్ని నిరాకరించలేదు దయానిధి. ఒకప్పుడు తనే కోమల్ని ప్రపంచానికి వదిలేసి తనదారిన తాను వొచ్చేసాడు—తను కోమల్ని పెళ్ళిచేసికొని, ఆమెకి విద్యాసంస్కారాల్ని తను యివ్వగల్గితే కోమలి యిలామారేదా? అందరిలా

తనుకోమలికి కొంత డబ్బిచ్చి తన బాధ్యతని వదులుకున్నాడు-ఇప్పుడా కోమలి తనని వెదుక్కుంటూ వచ్చింది ఇప్పుడు కోమల్ని నిరాకరిస్తే దయానిధి తనను తాను క్షమించుకోలేడు ఇప్పుడైనా కోమల్ని ఆదరించటం తన ధర్మమని దయానిధి అంతరంగానికి తెలుసు. కోమలిని తనతో ఉండమంటాడు.

కాని కోమలితో తను ఎలాంటి సంబంధం పెట్టుకోవాలో తేల్చుకోలేక పోతాడు దయానిధి ఆమెను శారీరకంగా వాంఛించలేడు- ఆమెశరీరం మలినమై పోయిందనే జిజ్ఞాస అతని చైతన్యంలో ఎప్పుడూ మెదులుతుంటుంది- ప్రపంచంలో ఎందరో తమ దాహాన్ని కోమలి పెదవులతో తీర్చుకున్నారనే తెలసీ దయానిధిని కోమలికి దూరం చేస్తుంది. ఆమెని యేవాంఛలేకుండా ప్రేమించలేడు- ప్రేమంటే వొక భయం దయానిధిలో యేర్పడింది- ప్రేమను వ్యక్తం చెయ్యకూడదు. మనలోని ప్రేమని మనలోనే దాచుకోవాలి- ఇతరులతో పంచుకోబోతె ఆ ప్రేమ తేలికౌతుంది- ద్వేషాన్ని ప్రేరేపిస్తుంది. తల్లిమీద తన ప్రేమంతా ప్రపంచం తనని హింసించటానికే తోడ్పడింది మానవత్వం మీది తనప్రేమ -సమాజాన్ని బాగు చెయ్యాలనే తన ఆకాంక్ష- సమాజంలో తనమీద ద్వేషాన్ని రెచ్చగొట్టింది కోమలి మీది తనప్రేమ కోమలికి డబ్బివ్వటంతో తేలికై పోయింది- ఇలా దయానిధికి ప్రపంచంలో తను ఊహించిన ప్రేమ ఎక్కడా లభ్యం కాదు. కావ్యాల్లోను, వ్యక్తుల ఊహల్లోనుకన్పించే ఆదర్శప్రేమకిప్రపంచంలో స్థానంలేదు. అని తెలిసి కుంటాడు- అందువల్ల కోమలిని ప్రేమించిలేడు.

కాని కోమలిప్పుడు పూర్వపుకోమలికాదు. పూర్తిగా మారిపోయింది- అప్పటి మూర్ఖత్వం, అమాయకత్వం పోగొట్టుకొంది- మానసికంగా యెదిగింది తన్నుతాను సంస్కరించుకుంది-వొకప్పుడు దయానిధి తనని గాఢంగా ప్రేమించాడని, ఆ ప్రేమకిబదులు తను ఏమి ఇవ్వలేకపోయిందని యిప్పుడు తెలిసికొంది. ఇప్పుడు ఆ ఋణం తీర్చుకోవాలని. ఇప్పుడు దయానిధి ప్రేమకు తాను అర్హురాలనని దయానిధిని వెతుక్కుంటూవచ్చింది. తన శరీరం మలినమైన తన ఆత్మమాత్రం ఎన్నాళ్ళనుండో దయానిధికోసం- దయానిధితో ఐక్యం కావాలని ఎదురుచూస్తోందని కోమలికి నమ్మకం కల్గుతుంది ఆ ఆత్మని దయానిధికిఅర్పిస్తేనే కోమలికి శాంతి లభిస్తుంది- అది తన శరీరాన్ని దయానిధి స్వీకరిస్తేనే సాధ్యమౌతుందని కోమలి తెలిసికొంటుంది-

కాని దయానిధికి కోమలిశరీరం అక్కర్లేదు- తన్నుతాను దయానిధికి

అర్పించుకోవాలని కోమలి-కోమలికి దూరంగా ఉండాలని దయానిధి-ఇలా ఇద్దరూ కొంతకాలం పెనుగులాడుతారు- ఆ పెనుగులాటలో ఇద్దరూ తమనుతాము తెలిసి కొనటానికి ప్రయత్నిస్తారు.

"నీకా జీవితంపైన అసహ్యంపుట్టిందికదా? మళ్ళా అదేనాదగ్గర కావా లంటావెందుకు" అంటాడు దయానిధి.

"ఛఛా- నేనుపోకిరిదాన్ని- కాని నేను మిమ్మల్ని ఎంత ఎక్కువగా ప్రేమించానో, మీకు తెలియపర్చడం ఎట్లాగ" అంటుంది కోమలి—

"ప్రేమలో ఎక్కువతక్కువలుండవు- నువ్వొకవ్యక్తిని ప్రేమిస్తావు లేక ద్వేషిస్తావు- అంతే"—దయానిధి

"ఎట్లాచెప్పాలో నాకుతెలీదు. జ్ఞానంవచ్చాక, ప్రేమంటే ఏమిటో తెలిసాక నాదంతా మీకిచ్చివేస్తే నా ప్రాణం స్థిమితపడ్తుంది"

"ఇచ్చేటందుకు నీ దగ్గర ఏముంది?"

"అంతా మీ కోసమే అట్టేపెట్టుకున్నాను—నాకు మరి ఎవ్వరితోను నిమిత్తంలేదు-మీకు నేనుతప్పఎవరూపనికిరారు-నాకుతెలుసు,నాకు తెలుసు-"అంటూ అతని నడుంచుట్టూ చేతులుబిగించి, అతనివొళ్ళో వాలిపోయి, మెడని చేతుల్తో బంధించి చంద్రునికేసి చూస్తూ ఏడ్చుసాగిస్తుంది కోమలి—

"నీ శరీరంతోతప్ప నాకు నీతోపరిచయంలేదు- ఆ శరీరం నీకిప్పుడులేదు. నాకు నువ్వు పరాయిదానవు తెలుసా?" అంటాడు దయానిధి.

"ఇది వట్టిది- నేనెంత అందంగా వుండగలనో మీరు ఊహించుకోలేరు. నాతో సంబంధంలేదుగనకనే మీరు ప్రేమిస్తారు-అంతే." అంటుంది కోమలి—

కోమలిఅన్నమాట నిజమే-దయానిధికి కోమలిశరీరంతో పరిచయంలేదు. పురుషుడు స్త్రీసౌందర్యాన్ని నిజంగా చూడగలిగేది తనను తాను తనకోసం అర్పించుకున్న స్త్రీని శారీరకంగా అనుభవించినప్పుడు-దయానిధి కోమల్ని ఎప్పుడూ అలా అనుభవించలేదు అందువల్ల కోమలిలోని నిజమైన 'స్త్రీత్వం'లోని సౌందర్యాన్ని దయానిధి చూడలేదు-అందుకే 'నేనెంతఅందంగావుండగలనో మీరు ఊహించలేరు' అంటుంది కోమలి-కోమలిలోని ఆ అందాన్నే దయానిధి చూస్తే 'నిన్ను ప్రేమిస్తాను-

కాని నీతో 'యే సంబంధం పెట్టుకోను' అంటూ కాలయాపనచేసేవాడుకాడు.

అసలు "ప్రేమంటే ఏమిటి?" అనే ప్రశ్నకు సరియైన సమాధానం చెప్ప కోలేకపోతాడు- తన్ను తాను పరిశీలించుకుంటున్నట్లుగా, తన్ను తాను తెలుసుకుం టున్నట్లుగా ప్రేమంటే తనదృష్టిలో ఇది అని యిలాచెప్తాడు:

"చూడు కోమలి- నాకు ప్రేమంటే ఏమిటో యింతవఱకు తెలిసింది కాదు అందరిలాగా, శరీర వాంఛనే ప్రేమనుకొని, నన్ను నేను దగా చేసుకోలేను. ఇతరులు ఎవ్వరితోను, ఏ వొక్కరితోనూ పంచుకోలేనిది నా ప్రేమ. అదొక దృష్టి- జీవితంఅంతటినీ, తుదీమొదలూ, ముందూవెనక అన్నింటినీ దూరంగాచూసి అర్థం చేసికునే ప్రపంచంపై వొకచూపు. నా ప్రతీమాటనీ, భావాన్ని, చర్యనీ ఆ దృష్టి పురిగొలుపుతుంది నీతో స్నేహంవల్ల ఆ దృష్టి పోతుంది."

ఇది ప్రపంచానికి భయపడిన వాడి మనస్తత్వం ప్రపంచంనుండి దూరం గా పారిపోవాలనుకునే సన్యాసితత్వం. ప్రపంచంచేత హింసించబడిన దయానిధి యిలా మాట్లాడటంలో ఆశ్చర్యంలేదు- కాని కోమలిదృష్టిలో ప్రేమంటే ఇదికాదు' ప్రేమంటే దయానిధికంటే స్పష్టమైనభాషలో యిలాచెప్తుంది కోమలి:

"ప్రేమంటే—ఇద్దరూ వొక్కరిలాగుండి, కలసి, సంతోషపడి యితరులకి సహాయపడి వారినికూడా సంతోషపెట్టటం. మనం వొకళ్ళకివొకళ్ళు తన్మయత కలి గించుకుంటాం- అప్పుడు ధైర్యంగా, బలంగా, సరదాగా ఉంటుంది. ఆ టైమ్‌లో ఎన్నోమంచిపనులుచేస్తాం......."

ఇది నిజమైన మానవత్వపు విలువల్ని చాటే ప్రేమ—కోమలి దయానిధి అంతటి మేధావి కాకున్నా తన ఆత్మతో అనుభవం ద్వారా అర్థంచేసికున్న దృష్టి అది- ప్రేమంటే ఇద్దరిదృష్టిలోని ఈ వైరుధ్యం కారణంగా, వొకరితోవొకరు నిజ మైన ఐక్యతని సాధించలేక పోతారు-చివరకు దయానిధికి జ్ఞానోదయం కల్గుతుంది. అతనిలో అతను సృష్టించుకున్న భ్రమలన్నీ తొలిగిపోతాయి తనను తాను పరి పూర్ణంగా తెలిసికుంటాడు-తనతో తను ఏకమై తన్నుతాను స్వీకరించుకుంటాడు. తన్నుతాను తెలిసికున్న తరువాత, తన్నుతాను స్వీకరించుకున్న తర్వాత ప్రపంచాన్ని తెలిసికోవచ్చు-ప్రపంచాన్ని స్వీకరించవచ్చు-దయానిధి అదేచేస్తాడు. ప్రపంచాన్ని అంగీకరిస్తాడు-సంఘాన్ని మార్చలేడు—మనుష్యుల్ని మార్చలేడు మారిస్తే బాధ,పగ, యుద్ధం. తనతోతాను సమాధాన పడాలి. అది ఈనాటికి సాధిస్తాడు. వొక ప్రశాంత

పవిత్రమైన మహత్తర ఆనందం అతనిలో ఉద్భవిస్తుంది-వొక క్రొత్త ప్రదేశంలో క్రొత్త జీవితం సాగించాలని ప్రయాణమౌతాడు- ఆ క్రొత్త జీవితంలో తన జీవిత భాగస్వామిని కావటానికి కోమల్ని వెంటతీసికెడతాడు- తనతో జీవించటానికి అర్హురాలైంది వొక్కకోమలేఅని తెలిసికుంటాడు- కోమలిశరీరం మలినమైందనే భ్రాంతి దయానిధిని వదలిపోయింది- కోమలిఆత్మ తనకంకితం అయ్యింది-కోమల్ని స్వీకరిస్తాడు-కోమల్ని స్వీకరించటంతో దయానిధ్జీవితానికొక నిండుతనంవస్తుంది, దయానిధి మొదలేఅనుకున్నట్లు "మరోప్రపంచంలో దయానిధికోమలి వొక్కరే." యేదో శాపంవల్ల ఇద్దరూ ఈ ప్రపంచంలో విడిపోయినారు- విడిపోయినప్పటినుండి వొకర్నొకరు అన్వేషించుకొంటూనేవున్నారు- ఇద్దరూ వొకర్నొకరు గుర్తించుకోవటానికి ఇంతకాలంపట్టింది- అన్వేషణ అంతమైంది-మళ్లాఇద్దరు వొక్కరయ్యారు- ఇలా దయానిధికోమలుల ప్రేమ వొక అలౌకికమైన ప్రేమగా భాసిస్తుంది. దయానిధికి చివరకు మిగిలింది కోమలి.

దయానిధి జీవితాన్ని గాఢంగా ప్రభావితంచేసినమరోస్త్రీ అమృతం- నవలలో పాఠకుడి అభిమానాన్ని వెంటనే చూరగొనేపాత్ర అమృతం- అమృతంలో దయానిధి, కోమలిలోఉన్న క్లిష్టత, డొంకతిరుగుళ్ళు, అస్పష్టతలేవు-అమృతం ప్రకృతికి ప్రతీక- అతిసహజమైన ప్రవర్తనగలది దయానిధికిమల్లే మేధావికాదు-ప్రతీదాన్ని తర్కించి, విమర్శించి, లోతుల్ని తెలిచి చూడాలనే తహతహ ఆమెకులేవు. కోమలిలా నవలలో రెండు విభిన్నజన్మల్ని యెత్తదు. మనిషిగా- నిండుమానవత్వంతో- ఎదుటి వ్యక్తి కష్టసుఖాల్ని అర్థంచేసుకొని- జీవించింది- స్త్రీగా - నిండుస్త్రీత్వంతో- మాతృత్వంపొందింది. అంతే- అంతకంటే అమృతానికి యే ఆశలు, ఆదర్శాలు లేవు.

ఎడారిలాంటి దయానిధి బ్రతుక్కి ఒయాసిస్సులా దర్శనమిస్తుందిఅమృతం. దయానిధ్కి అమృతానికిమధ్య వెంటనే ఆత్మీయతజనిస్తుంది. అమృతంలోని సహజత్వం, నిరాడంబరత, అమాయకత్వం, చనువు దయానిధి హృదయంమీద పన్నీటిజల్లులా కురుస్తాయి. దయానిధి తనతోతాను- తన తార్కికశక్తితో, ఊహావైశాల్యంతో, వైజ్ఞానికమథనంతో విసిగిపోయినవ్యక్తి -సహజమైనజీవితంకోసం దయానిధి మొహంవాచి ఉన్నాడు- అది అమృతం ప్రసాదిస్తుంది.

దయానిధికి అమృతం వెంటనే నచ్చటానికి మరోకారణం- దయానిధి తల్లిరూపానికిఅమృతంఅద్భుతంగాసరిపోతుంది తనని, తనవ్యక్తిత్వాన్ని, తనకోరికల్ని

తన ఆశల్ని, ఆశయాల్ని విమర్శించకుండా సహృదయంతో అర్థం చేసుకోవడంలో అమృతం దయానిధికి తనతల్లినిజ్ఞాపకంచేస్తుంది. స్త్రీలోని గొప్ప ఔదార్యానికి, ఆదరణకి, ఆపేక్షకి మూర్తీభవించిన రూపంగా అమృతం దయానిధికి కనిపిస్తుంది.

ఇక అమృతానికి—దయానిధి అంటే వెంటనే ఆపేక్ష, అభిమానం, ఆదరణ, అనురాగం కల్గుతాయి. తల్లిని కోల్పోయిన యేకాకిగా దయానిధి ఆమెకు కన్పిస్తాడు. అతనికి మాతృప్రేమ కావాలని స్త్రీ సహజమైన మాతృత్వంతో అర్థం చేసికుంటుంది అమృతం. దయానిధి అందరి వ్యక్తుల్లాంటి వాడు కాడని, వొక విశిష్టమైన వ్యక్తిత్వం కలవాడని అమృతం తెలిసికొంటుంది. పెళ్ళి చేసికున్నా భార్యకి దూరంగా, స్త్రీసుఖానికి దూరంగా దయానిధి ఉండటం ఆమెకు అతనిపట్ల యింకా కరుణ, జాలి, ప్రేమ కలుగజేస్తాయి.

దయానిధికి కోమలికంటే అమృతం దగ్గరౌతుంది. కోమలిమీద తన ప్రేమ వన్ వే ట్రాఫిక్-కోమలి దయానిధికి తిరిగి యేమి యివ్వలేదు. అతన్ని అర్థం చేసికోదు. ఆదరించదు. కాని అమృతం స్త్రీగా తను యివ్వగల్గింది యిస్తుంది. దయానిధికి అమృతంలో మాతృమూర్తి, ప్రేయసీ ఇద్దరూ కన్పిస్తారు.

కాని అమృతం వివాహిత. సాంఘిక కట్టుబాట్లని ధిక్కరించే ధైర్యం గాని, మనోనిబ్బరంగాని దయానిధికి, అమృతానికి లేవు. వాళ్ళు *Rebels* కారు-అందువల్ల ఇద్దరికీ నిజమైన 'ఐక్యత' సాధ్యం కాదు. దయానిధి కోమలిమీది వాంఛని ఎలా ఊహలతో (*Sublimation*) తృప్తి పరచుకుంటాడో, అమృతం మీది కోరికని కూడా అలాగే తీర్చుకోబోతాడు-ఊహలతో కోరికలు తీరవు-దయానిధి అమృతం మధ్య ప్రేమ ఫలించదు. అది విషాద భరిత ప్రేమగా ఊహించుకుంటాడు దయానిధి. అమృతాన్ని విషాదానికి చిహ్నంగా యెంచుకుంటాడు.

"రాతి శిథిలాలమధ్య ఉండాల్సింది అమృతం-ఎక్కడో, యే హంపీ కొండల్లోనో—అన్నీ రాళ్ళు, భగ్న ప్రతిమలు, వొంటరిగా నిల్చిపోయిన స్తంభాలు, ప్రేమకోసం గుండె జాయిచేసుకున్న రాకుమార్తెల విగ్రహాలు-అన్నీ శిథిలమైపోయి, ఏ అర్థరాత్రో అడుగులచప్పుడు వినపడితే-కదులుతాయేమోననే ప్రమాదస్థితిలో పడిఉంటే—వాటిమధ్య అమృతం కూర్చొని నవ్వుతుంది"ట "ఆమె గడిచిపోయిన అనుభవపు వైభవాలని తలుచుకొని, ఏడ్చి అతీతమైనప్పుడు కన్నీరు

చుక్కలుచుక్కలుగా రొమ్ములమధ్యనుంచిజారి ఈనాటికి నదిగా ప్రవహిస్తోంది"ట. ఇలాంటి ఊహలు దయానిధికి తృప్తినిస్తాయి. అమృతానికి తన జీవితంలో ఆనందం లేదని, భర్త, సంసారం మొదలైనవి ఆమెకు సంఘం బలవంతంగా విధించిన సంకెళ్ళని. ఆమె గొప్ప ప్రేమమూర్తి. ఆమె నిజంగా తనకి చెందాలని దయానిధి నమ్మకం. కాని-సమాజాన్ని ధిక్కరించి ఆమెను లేవదీసుకు పోయి తనదాన్ని చేసికొనే సాహసం దయానిధికి లేదు-అమృతంకూడా అందుకు సిద్ధంగా లేదు.

దయానిధి పెళ్ళిచేసుకుంటాడు. సమాజంకోసం. సమాజంమీదికసితో పెళ్ళికి వొప్పుకుంటాడు- భార్యను, మామను, అత్తను ఆసమాజానికి ప్రతినిధులుగా యెంచుకొంటాడు. సమాజంతనమీది ద్వేషంతో తనకి బిగించినసంకెళ్ళువాళ్ళంతా అనుకుంటాడు- దయానిధి భార్య-ఇందిర "మీ అమ్మకూడా యింతేటగా" అనటంతో ఆమెను క్షమించలేకపోతాడు. అవివాహంవిచ్ఛిత్తి కాకతప్పదు దయానిధిని అతని భార్యతో కలపాలని, భార్యద్వారా అతనికి స్త్రీ సుఖాన్ని యివ్వాలని అమృతం ప్రయత్నిస్తుంది. తనుయివ్వలేని సుఖాన్ని ఇందిరద్వారానైనా యిప్పించి తృప్తిపడాలని అమృతం ప్రయత్నిస్తుంది కాని దియానిధికి ఇందిరకుమధ్య తను పడగొట్టలేనిగోడలెన్నో ఉన్నాయని తెలిసికుంటుంది దయానిధిని రోజురోజుకు జీవితం కుంగదీస్తుంది. అతన్ని సమాజం వెలివేస్తుంది అతని ప్రాక్టీస్ ఫెయిల్ ఔతుంది- ఎంతో దయనీయమైన స్థితిలో ఉంటాడు. ఆస్థితిలో దయానిధినిచూడటానికి వస్తుంది అమృతం వయస్సు. అనుభవం దయానిథి మీద వేసిన ముద్రల్ని చూస్తుంది. అతని పట్ల ఆమె హృదయంలో కరుణ, జాలి, ప్రేమ, అపేక్ష కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తాయి-యౌవ్వనంలో పురుషుడు పొందగల్గే గొప్ప సుఖం-స్త్రీసుఖం-దయానిధి కోల్పోతున్నాడు-రోజురోజుకు అతని యౌవ్వనం హరించిపోతుంది. ఇప్పుడు కాకపోతే యిక ఎప్పుడూ అతడా సుఖాన్ని అనుభవించలేకపోతాడనే భావన ఆమెలో కల్గుతుంది. స్త్రీగా తను దయానిధికి ఆసుఖాన్ని యివ్వగలదు. అది యివ్వాలనే నిజమైన మానవత్వం అమృతంలో సహజంగా ఉద్భవిస్తుంది. దయానిధి ఆకలిని, దాహాన్ని తీర్చటం తన విధి అనుకుంటుంది. ఆ విధి నిర్వహణంలో-సమాజం. కట్టుబాట్లు. నీతి, భర్త, సంసారం- అన్నింటినీ ఆ క్షణం కోసం విస్మరిస్తుంది దయానిధికి తనను తాను అర్పించుకుంటుంది ప్రపంచంలో-దయానిధిలైంగిక ప్రవృత్తిలో స్థావర మేర్పఱచుకున్న తల్లిరూపాన్ని *(Mother fixation)* 'ఫిజిడిటీని' భ్రద్దలు చేయగల స్త్రీ ఎవరన్నా ఉంటే ఆమె అమృతం-అమృతం ఆపని చేస్తుంది.

అతనిలోని సెక్స్‌పట్లగల భయాన్ని *Mother fixation*ని బ్రద్దలు చేస్తుంది. అమృతం దయానిధి తల్లిరూపానికి చక్కగా సరిపోతుంది. ఈ కారణంగా దయానిధిలో పేరుకుపోయిన ఆ ఫిజిడిటీని బ్రద్దలు కొట్టటంలో అమృతం కృతకృత్యురాలౌతుంది. (సరిగ్గా ఇది జరిగే ముందే గోడనున్న దయానిధి తల్లి ఫోటోగ్రాఫ్ గాలికి క్రిందపడి పగిలింది. దయానిధి లైంగిక ప్రవృత్తిలోని తల్లి రూపం కూడ బ్రద్దలవబోతుందని సింబాలిక్‌గా సూచించాడు రచయిత)

ఆ అనుభవం అతనికి క్రొత్తలోకాల్ని, క్రొత్తదృష్టిని ప్రసాదిస్తుంది. "ఎక్కడికో యింకా యింకా దగ్గరగా కదలి వొక్కరై అన్నిరహస్యాలు ఛేదించి అన్నిలోకాల్ని శోధించి, అన్నిశిఖరాలని సోధించి వొంటిజీవంగా కొట్టుకొ విశ్వరహస్యానికి ప్రాణంపోస్తారు" అమృతం దయానిధి శరీరం అనుభవంతో ఆత్మైపోయిన క్షణ"మది. "ఆర్థిక, సాంఘిక, చారిత్రిక వ్యత్యాసాల కతీతమైన మ్నిషినీ మనిషినీ స్నేహపాశంలో బంధించివేసే మానవత్వంయొక్క శక్తుల్ని తలచిమాసి"న క్షణమది-

ఈ అనుభవంతో దయానిధిలోని లైంగికజడత్వం మాయమై క్రొత్తవాడుగా క్రొత్త జీవముతో రు పొందుతాడు-ఆ మహత్తర అనుభవంతర్వాత ఆ పాత పరిసరాల్లో నివసించలేని- ఎక్కడికో దూరంగా క్రొత్తజీవితం ప్రారంభించటానికి వెళ్ళిపోతాడు.

దయానిధి రాయలసీమకి వెడతాడు- భాగ్యవంతుడౌతాడు- కొంతకాలానికి అమృతంకడుపుతో ఉందని తెలుస్తుంది- అమృతనికి పుట్టబోయెబిడ్డ తన కారణంగానేనా? అనే అనుమానం వస్తుంది. ఆ బిడ్డ తనబిడ్డేననుకోవటం దయానిధిలోని పురుషత్వానికి సంతృప్తిని కల్గిస్తుంది-అబిడ్డ అమృతానికి తనకిగల ప్రేమకి చిహ్నంగా నిలిచిపోతుందనే ఆశ- కాని అతనిలో ఎప్పుడూ ఉండేపాపభీతివెంటనే మేల్కొంటుంది- తను అమృతం జేసిన పాపం ఆ పాపరూపంలో 'అమరత్వం' చెందుతుందనేభయం. ఆ పాపం బ్రద్దలై ప్రపంచానికి తెలిస్తే అమృతం కాపురం బజారుపాలౌతుందనేభయం- దయానిధిని కలవరపెడతాయి.

త్వరలోనే అమృతానికి కూతురనేవార్త వస్తుంది స్వయంగావెళ్ళి ఆ కూతురు నిజంగా తనకూతురేనా? తెలిసికోవాలని దయానిధి బయిల్దేరుతాడు. అమృతం తనతో పూర్వంలాగే మాట్లాడుతుందని, తననితాను అర్పించుకుంటుందని ఆమె

తో గడపబోయేక్షణాలని ఊహించుకుంటూ వెళ్తాడు-

"ఎందుకొచ్చావుబావా! నువ్వు శాశ్వతంగా నాదగ్గరేఉంటావు. నిన్ను పంచుకున్న ఫలితంబావా ఈ పిల్ల" అని అమృతం అంటుందని దయానిధి ఆశిస్తాడు- ఇంకా అమృతం ఇలామాట్లాడుతుందని తనలో తను రూపకల్పన చేసికుంటాడు.

"బావా! నీకుతెలుసు! ఘోరంజరిగింది- నీదగ్గరఉండేసాహసంలేదు. నిన్నువదలిఉండే గుండెకాదు- నేను బతకలేనుబావా—"

అందుకు అతను "నన్ను మరచిపో అమృతం-అని చెప్పటానికేవచ్చాను" అంటాడు.

"నీలా సులబంగా మరిచిపోలేను బావా- మరిచిపోయిననాడు ఈ అమృతం విషంకాదు? నిన్నుమఱచి స్త్రీత్వాన్ని కోల్పోతానా?" అంటుంది అమృతం.

ఇలా తను అమృతం గొప్ప విషాదకావ్యంలోని నాయకీ నాయకుల్లా ఊహించుకొని అమృతం యింటికి వెడతాడు దయానిధి.

కాని దయానిధిలోని ఈ భ్రమల్ని, ఈఊహల్ని బ్రద్దలుచేస్తుందిఅమృతం. ఆ నాడు దయానిధిలోని లైంగిక జడత్వాన్ని బ్రద్దలుచేసింది అమృతం. ఈ నాడు కావ్యాల్లో గానంచెయ్యబడే ఆదర్శ ప్రేమని నిజమనుకొని ప్రపంచంలో వెదుకబోయిన దయానిధిలోని భ్రమని బ్రద్దలు చేస్తుంది- దయానిధికి మరోమారు క్రొత్త దృష్టిని, క్రొత్తజీవితాన్ని యిస్తుంది అమృతం- వాస్తవిక ప్రపంచంలోని యదార్థస్వరూపాన్ని చూపిస్తుంది, అతి లౌక్యంగా ప్రవర్తిస్తుంది అమృతం— అమృతాన్ని రహస్యంగా కలిసికోవాలని, దొడ్డిదారినవచ్చిన దయానిధిని వెంటనే వాళ్ళ అత్తకి, భర్తకి పరిచయం చేస్తుంది. "నీ బిడ్డ" అంటు అందరిముందు తనపాపని దయానిధికి చూపిస్తుంది "అత్తయ్యా! అచ్చంగా బావపోలిక కదు" అంటుంది. దయానిధి ఈ ప్రవర్తనతో విపరీతంగా చలించిపోతాడు-"ఆతన్ని కదిపివేసినమహత్తరఅనుభవం- తనకి జరగనట్లుగానే అమృతం ప్రవర్తించటం దయానిధిని క్రుంగదీస్తుంది- ఆ అనుభవాన్ని "వొంకాయలబేరం తెగింపుకాక- కూరగాయలమనిషిని పొమ్మన్నట్లు- అంతచులకన" చేస్తుంది అమృతం అమృత యొక్క ఈ లౌక్యం ఇంతకాలం అతను నమ్మిన ఆశయాలు, ఆదర్శాలు పటాపంచలయ్యేలా చేస్తుంది. అయినా యింకా యింకా అమృతం యేదో చేస్తుందనే ఆశ- తనను బయట పడుకోబెట్టి భర్తతో గది

లోపడుకున్న అమృతం- మధ్యరాత్రిలేచివచ్చి తనని తృప్తిపరుస్తుందని ఆశిస్తాడు- "ఆరుగజాలదూరంలో అమృతం—తన బరువైన సౌందర్యాన్ని భర్తకు అప్పగించటం ఊహించుకొని, బాధపడి నిద్రంతా పాడుచేసుకుంటాడు- కనీసం తనని ఇంత కాలం బాధించిన సందేహం- 'అమృతంబిడ్డ నిజంగా తనబిడ్డేనా' అనే సందేహాన్ని కూడా అమృతం తీర్చదు తెలివిగా తప్పించుకుంటుంది—ఈ అనుభవంతో దయానిధి చాలా మారిపోతాడు- అతనిలో పవిత్రప్రేమ, మహత్తరప్రేమల్ని గూర్చిన భ్రమలన్నీ తొలిగిపోతాయి- యివన్నీ జీవితయుద్ధంముందు అర్థంలేనివని తేల్చుకుంటాడు—ఇన్నాళ్ళు తను ప్రపంచంలో లేనిదానికోసం ప్రయత్నించాడు-ప్రపంచాన్ని ఉన్నదున్నట్లుగా స్వీకరించాలనే నిర్ణయానికొస్తాడు- కోమల్ని స్వీకరించి తనతో తాను సమాధానపడి, ప్రపంచంతో సమాధానపడటంతో దయానిధి అన్వేషణముగిసి శాంతిని సాధిస్తాడు-

ఇలా వ్యక్తి తన్నుతాను తెలిసికొని, తన్నుతాను సంస్కరించుకొని, తనతో తాను ఐక్యమై, తనతో తాను సమాధానపడితేనే సమాజంతో, బాహ్యప్రపంచంతో సమా : నం కుదుర్తుందనే వొక జీవిత దృక్పథాన్ని కల్గిస్తుంది "చివరకు మిగిలేది."

[నన్ను నేను తెలిసికోవాలనే ఆత్మజిజ్ఞాసని నాలో రేకెత్తించిన బుచ్చిబాబు దివ్యస్మృతికి వొక జ్ఞాపకచిహ్నంగా ఈ వ్యాసాన్ని ఆయనకు సమర్పిస్తు న్నాను.
—నవీన్]

# నాకు తెలిసిన బుచ్చిబాబు

-సి. యస్. రావు

బుచ్చిబాబుగారు చనిపోయారన్న వార్త వినగానే నాకు విచారం కలగలేదు.

కోటికోట్ల సౌదామినులు వక్కసారిగా వెల్గి ఘప్పున చిమ్మచీకటైనట్లు, భూగోళం అణుప్రాయంగా కుంచుకుపోయినట్లు, విశ్వపరిస్పందన కతీతమన్నట్లుగా అనిపించే శిలనుమించిన శిలగా నిలిచిపోయాను.

వైట్‌హెడ్ చెప్పే అమరత్వం ఆయన సిద్ధించుకున్నాడు. విశ్వ పరికంపనలో తానుపొందిన తాదాత్మ్యతా, అడవినకాయించిన వెన్నెలలు, యెల్లోరాలో చేయించిన యేకాంత సేవలూ మన చుట్టూనే వున్నాయి; మనలోనే వున్నాయి. ఆయన చనిపోయారనే విచారం మన అజ్ఞానానికి చిహ్నంమాత్రమేనని మన మనోఫలకంమీది చెరగని ఆయనరూపు విశదంచేస్తోంది*.

---

* అకాల మరణం అనేదాంట్లో నాకు నమ్మకంలేదు. మృత్యువు, కేవలం మనం మీటనొక్కి పిలిపించేదీ పంపించేదీకాదు. విశ్వలయానుక్రమణికలో తమకు తాము ప్రపూరితులవుతారు. శంకరాచార్యుడు 32 సంవత్సరాలకూ, వివేకానందుడూ, క్రిస్టొఫర్ కాడ్‌వెల్ 28 ఏళ్ళకూ చనిపోయినా అకాల మరణమనిపించుకోదు. కాలం అనేది గడియారం ముళ్ళలోనూ, అంకెలలోనూ యిమిడిలేదు. మేధో అస్తిత్వానుసారానుగుణమైనది కాలం. యేదో అస్తిత్వయాన్ని జీవితకాలం అని వ్యవహారించుకుంటాం. (32 సంవత్సరాలకు చనిపోయిన శంకరాచార్యుడు, 64 సంవత్సరాలు బ్రతికివుంటే యింకెంత గొప్పవాడైవుండునో అనిపించవచ్చు చనిపోయిన శంకరాచార్యుణ్ని చావనట్లుగా మరో 32 ఏళ్ళు బ్రతికించామనుకుందాం-అప్పుడు కూడా మునుపటికంటే గొప్పవాడు కాలేడు అదే పుస్తకం మరికొన్ని ప్రతులు అచ్చొత్తినట్టుగా వుంటుంది ) మేధోఅస్తిత్వయానం కాలాధారమైనదికాదు. కాలం మూలాధారం కాదు; వ్యవహారాధారం మాత్రమే.

'సృజన' సంపాదకులు బుచ్చిబాబుగారుపోయిన సందర్భంగా ఒక వ్యాసం వ్రాయమని నన్ను కోరినప్పుడుమాత్రం దుఃఖం ముంచెత్తి వేసిందినన్ను, ఆయన ధర్మపత్ని గుర్తుకొచ్చి. అప్పుడు బోధపడింది నాకు బుచ్చిబాబుగారి మరణం అంటే యేమిటో. నే కార్చిన కన్నీరు ఆమె మనశ్శాంతికి దోహదమైతే ధన్యుణ్ని. ఆమెయొక్క నిత్యమంగళపార్వతీదేవి వదనం నా కనులముందు నిలిచి, హేమంతంలో వెచ్చగా ఆవరించే ఆవిరిపొగలాంటి ఆమె ఆప్యాయత మనసులో మెదిలి, గుండెచిట్లి, కన్నీరై నను ముంచెత్తి వేసింది. ఆయనరూపు యెంతమాత్రం చెరగనిదే, చెరిగినదీ, తరిగినదీ ఆమెరూపు, ఇప్పటి ఆమె ఊహకొచ్చి- వెళ్ళకనిపించాల్సిన నా విధి గుర్తుకొచ్చి- కంపితుడయ్యాను. నడివీధిలో నగ్నంగా ననునిలుచోబెడితే, అతినైచ్యమైనకార్యం చేస్తే యెలా కుంచుకుపోతానో అలా అయ్యాను. నేరస్థుడిలా తలవంచుకున్నాను ఆమెను యిప్పట్లో చూడగల మనస్థయిర్యం నాకు లేదు. ఆమె రచయిత్రేకాక వుత్తమ యిల్లాలు కూడాను. ఆమె తన అర్ధాంగి కావడం బుచ్చిబాబుగారి జీవితంలో అన్నింటమించిన అదృష్టమని నా భావన. ఆమె సాన్నిధ్యంలోనేను పసివానిలా, పండువృద్ధునిలా అనుభూతిచెందేవాడిని. వారి యింటికివెళ్ళివచ్చాక నా భార్య అంది- యిదేమిటీ యీ భువిమీదకూడా దేవతా! అన్నట్లుగా అనిపించింది ఆ పుణ్యమూర్తినిచూస్తే పాపాలుపోతాయండి. యేడు సంవత్సరాలలో వారూ, మనం వకవూళ్ళో వుండటంజరగక, మీరు నన్ను వారిదగ్గరికి తీసికెళ్ళటం పడకపోవటం నా దురదృష్టంమాత్రమే.

ఈ వార్త తెలిశాక, కళ్ళనీళ్ళు నింపుకుని, ఆ మహావ్యక్తిని వక్కసారి మాత్రమే చూడగలగడం, ఆవిడ ఆ నాటి రూపుకి వక్కసారిమాత్రమే నోచుకున్నానంటే నేనెంతటిపాపంచేసివుంటానో! అంది, దుఃఖం మాటల్ని పూడ్చివేస్తుండగా వక్కసారిచూసిన తనకే అలా అనిపించితే, యింతకాలపు సాంగత్యం- యింక నా స్థితి—

బుచ్చిబాబుదంపతులు నా జీవితాన్ని మలచుకోవడంలో పరోక్షంగా యెంతో దోహదం అయ్యారు వారిగృహం కొద్దిసార్లుచూడటం మొదలయ్యాక నా లోని అధివాస్తవిక భావనలు, ఛాయలు క్రమక్రమంగా అంతరించాయి. నా ఆత్మీయ బంధు మిత్రపరిధిలో యెవరైనా చనిపోయారంటే అది బుచ్చిబాబుగారితోటే మొదలు. బహుశా, అందుచేతనేమో ఆ మరణవార్త కలిగించిన అనుభూతి నన్నింకా దహిస్తోంది.

గత సంక్రాంతినాడు వారింటికివెళ్ళాను భార్యాసమేతంగా. అప్పటికి ఆయన్నిచూసి యేడాది కావొస్తోంది. పోల్చుకోలేనంత యిదిగా కనిపించారు. వక్క యేడాదిలో పదిసంవత్సరాల వయస్సు ఆవరించి- వృద్ధుడిలా అనిపించారు. లివర్ యెన్‌లార్జ్‌మెంటువల్ల అస్వస్థతట:

నేను లెక్చరర్ అయ్యాక కలవటం అదేమొదలు సోఫాలో అనువుగా వుండటంలేకన్ని, క్రింద తివాసీమీద కూచున్న. 'ఇలాగే చొక్కా పట్లా వేసుకునేం వెడతావాక్లాసుకి లేక బొత్తాములకోటూ, నెక్ టై బిగించి వెడతావా?' అని అడిగారు. నా పై ఆయనకు ప్రగాఢమైన వాత్సల్యమూ, ప్రేమానూ.

గదిచుట్టూ పుస్తకాల బీరువాలూ, వకటిరెండు తైలవర్ణచిత్రాలూ, శిల్పంధృష్ట్యా విలువైన బొమ్మలు- మధ్యలో తివాసీమీద కూచున్న బుచ్చిబాబు- అవన్నీ డబ్బుపెట్టికొంటెరావొచ్చు కాని సాంద్రంగా అలముకున్న ఆ సృజనీయ కళావరణం- అదిమాత్రం ఆయననించీ ఆవరించినదే. దగ్గుతెరలమధ్యనుంచి, ఆయాసపు పొరలలోంచి మాతో మాటాడుతూ, కాగితంబొమ్మలు కత్తిరిస్తున్నారు.

వర్షపు నీళ్ళ జాలులో కాగితం పడవలువేసే పసివాని నైర్మల్యత, విశ్వపుగోళాల కదలికల సూత్రాల కీలకాలను తెలుసుకోవాలనే శాస్త్రజ్ఞుడి మథనం, పసిబిడ్డని గుండెకు హత్తుకోవాలనుకునే నిండుచూలాలి తపన, సృజనీయ జగత్తునంతటినీ తనలో అద్వైతించుకోవాలనే రస జీవిలాలస-ఆయన చేతివ్రేళ్ళ కదలికలో. కనుచూపుకొసలో ద్యోతకమౌతున్నాయి.

చిన్న రేకుపెట్టెకి ఆ బొమ్మల్ని అతికి చక్కని కళాత్మకమైన వస్తువుగా చేశారు తరువాత నా భార్య అంది. 'ఆయన్నిచూస్తే సృష్టికర్త తన పనిలో నిమగ్నమై వున్నట్లు'గా అనిపించిందని.

విశ్వపుపెల్లోరాలలో యెన్ని యేకాంత సేవలు చెయ్యనిదే 'మధుసూదనా'న్ని మనకందించగలరు!

అస్వస్థతగా వున్నారనేగానీ, అదే తుదిచూపు అవుతుందని నేనూహించుకోనలేకపోయాను. ఆయన ఆరోగ్యంకోసం, దేవికి నమస్కరించాను. ఆ తరువాత తన ఆరోగ్యం కాస్త మెరుగ్గావున్నట్లు వ్రాశారు. అంతలోనే యీ వార్త 'అనాది ఓంకార అయాభూతం సర్వమూ, మనము, మనకి తెలిసినదీ యెంత?'

1953 లో, చదువులు, ఉద్యోగం, సంపాదన-సాహిత్యం, యీ సమస్యల చిక్కులో అవస్థపడుతున్న నాకు 'చివరకు మిగిలేది' చదవడంవల్ల, వెన్నెలతో వచ్చి చిన్నదాని కన్నెరకపు తెరలు తొలగించమని వో వున్నవాళ్ళ చిన్నవానికి కబురంపిన సానిదాని మాతృహృదయ సంస్పందనలా, నా చుట్టూ ఏదో ఆవిరిపొగలా ఆవరించింది. నన్ను మార్చిన, మలచిన పుస్తకం చివరకుమిగిలేది! ఆ తరవాత ఆయన కథలు మరికొన్ని చదివాను.

1956 లో 'చివరకుమిగిలేది'పై వ్యాసం వ్రాసి, ఆయనకి పంపించి, చదవమనీ, యేమైనా తెలియజెయ్యాలనిపిస్తే ఉత్తరం వ్రాయమనీ రాశాను. ఆయన నాకేమీ వ్రాయలేదు. ఆరునెలల తరువాత వో పత్రికవాళ్ళు నా వ్యాసం కావాలన్నారనీ, పంపించినట్లూ రాశారు అంతే. ఒకే నగరంలో వుంటూకూడా ఆయన్ని కలుసుకోలేదు ఆయన పనిచేసే 'ఆకాశవాణి' దగ్గరలోంచే తరచూ వెడుతూవుండేవాడిని నాకు సాధారణంగా ఏ రచయితనీ కలుసుకోవాలని వుండదు వకరకమైన భయం. మరో ఆరునెలల తరువాత ఆయన్ని కలుసుకోవాలనిపించింది. యింటికి వెళ్ళాను ఆరోగ్యంగా, ఉత్తేజంగా, ప్రగాఢమైన వ్యక్తిలా అనిపించాడు. మోహంలో పల్చటి నవ్వు-

సాహిత్యం, తత్వశాస్త్రాలకి సంబంధించిన కబుర్లు—మూడు గంటలు ఇట్టే గడిచాయి. తిరిగివచ్చాను. మనిషిలో సౌశీల్యత, ప్రగాఢత, మెతక కనిపించాయి. మొహమాటపడే మనిషిలా అనిపించారు కాని ముఖ్యమైన విషయాలపట్ల నిర్మొహమాటి, సౌకుమార్యమైన గంభీరత, అలా అని మూతిబిగించుకొని వుండేవారు కాదు. సందర్భం, కారణం వున్నప్పుడు 'హాహాహో' అని పెద్దగా నవ్వేవారు. ఎల్లకాలం నా చెవులో వినిపించే ఆ నవ్వులో మొదటి నిష్కల్మషం. 'దూషణకీ భూషణకీ తొణికేవారుకాదు నిండుకుండ తొణుకుతుందామరి' అప్పుడప్పుడూ వెళ్ళి కలుస్తూవుండేవాడిని ఆ తరవాత ప్రతి ఆదివారం ఉదయం 9 గంటల నుంచి 1 గంటవరకూ వారి యింట్లో గడిపి భోజనంచేసి రావటం పరిపాటి అయిపోయింది 1960 లో బదిలీ అయి పూనాకు వెళ్ళిపోయారు. అప్పట్లో మాకు అక్కడ వో చిన్న హోటలు ఉండేది. 'నేను బుచ్చిబాబుని అని తెలుపుకొని, నన్నడిగారట వొచ్చి. మా వాళ్ళకి ఆయన బాగా తెలుసుగానీ. ఆ వేళకి వాళ్ళెవరూ అక్కడలేరట కౌంటర్ దగ్గర యెవరో కూర్చొనివున్నారట ఆయన్ని వరుసగా నెలరోజులు చూడక పోవటం అదే మొదటిసారి. నాకు పూనాకి ట్రాన్స్ఫర్ అయింది. రెండు మూడు

రోజులలో వెళ్ళిపోతున్నాన'ని చెప్పమన్నారట. అంతటివ్యక్తి నాకోసం రావటం అంటే నాదెంతటి అదృష్టమో! నాపై తనకెంతటి ఆప్యాయతా, వాత్సల్యమూ ప్రేమా లేకపోతే అంతటివ్యక్తి శ్రమ అనుకోక నాకోసం వస్తారు! అనివార్యకారణాలవల్ల వెళ్ళి కలుసుకోలేకపోయిన దురదృష్టం మాత్రం నాకుదక్కింది.

సంవత్సరం తరవాత దక్షిణ దేశయాత్రచేసి, పూనాకి తిరిగి వెళుతూ హైదరాబాద్ వచ్చారు. 'చాలా దూరస్థలంకదా' అన్నాను. దేనికి దూరం? అక్కడి వాతావరణం బావుంటుంది. కొత్త పుస్తకాలు వెలువడగానే లభ్యమౌతాయి. ఉద్యోగంలో కూడా తీరిక ఎక్కువ చిక్కుతోంది చదువుకోడానికీ, రాసుకోడానికీ చాలా అనుకూలం.' అన్నారు. ఈ వాక్యాలలో ఆయన మనస్తత్వం యిమిడి వున్నట్లనిపించింది. ఆవిడ పలకరిస్తూనే 'బాబు నా, పాపా?' అన్నారు.

అప్పటికి నా వివాహం ఐ యేడాది, అలాంటిదేంలేదన్నాను 'యిల్లస్ట్రేటెడ్ వీక్లీలో మీ పెళ్ళిఫోటో చూశాం. చక్కా యింతలేసి కళ్ళూతీసుకురాకుండా యెలావచ్చారు?' అన్నారు. ఆ ఫోటో యేమిటో నాకు తెలీదు. మావాళ్ళెవరో ఆ పత్రిక పంపించివుంటారనుకొని, 'ఫొటోలో నీడపడి అంతలా కనిపించి వుండాలి. చిన్నచిన్న కళ్ళూ...పూరెళ్ళింది; యిక్కడలేదు.' అన్నాను 'వేసవిలో యిద్దరూ కలిసి తప్పకుండా పూనాకి రండి.' అన్నారు. ఆమాటలో, మనసులో యెంతటి అప్యాయత!

ఆ తరవాత కొద్దికాలానికి బెజవాడకి బదిలీ అయింది. కార్యానుసారం అటుకేసి వెళ్ళినప్పుడు కలుసుకున్నాను. మండువేసవి, అందునా; బెజవాడలోవేసవి నేనున్న మూడురోజులూ ఆయన దగ్గుతూనే కనిపించారు. అస్వస్థతకాదుకానీ, ఆరోగ్యం చితికినట్లు, రవ్వంత బోలుతనం యేర్పడినట్లు అనిపించింది. ఆ తరవాత కొంతకాలానికి నేను తిరుపతికిరావటం, ఆయనకి హైదరాబాదు బదిలీకావడం జరిగాయి.

నా పరిచయం అంతా పదిసంవత్సరాల కాలంమాత్రమే. కానీ కాలపు ముళ్ళకందని వో ప్రగాఢత, అనుబంధమూ యేర్పడింది. రచయితగా యెంత మెచ్చుకున్నానో, గౌరవించానో అంతకంటే వ్యక్తిగా ప్రేమ యేర్పడింది వొకపట్టాన యెవరూచెప్పినదీ విని వొప్పుకునేసే తత్వం నాలో లేకపోయినాకూడా ఆయనంటే వో గురుతరభావం యేర్పడింది

ఆయన యెలాటి సాహిత్యసభలూ, సమావేశాలు, వుద్యమాలు చెయ్య లేదు. యే సాహిత్యవర్గానికీ ముడిపెట్టుకోలేదు తనని. తనే వొక వుద్యమం మానవ మూలసూత్రాయుతమైన చైతన్య ఘర్షణ, వొక మహాయానం. వకఅంత ర్లీన మహాత్ ఝరి-

వకవ్యక్తి యేకాంతంలో యెక్కడో తపస్సుచేసుకుంటే మానవసమా జానికి యేమిచేసినవాడవుతాడన్న ప్రశ్నకి శ్రీ అరవిందునిసమాధానం గుర్తుకొ స్తున్నది. యేకాంతంలో, తన సాధనలో, తపస్సులో, ఠసిద్ధిలో తాను సాధించి నంతవరకే పరిమితంకాదు. అది విశ్వవ్యాప్తమౌతుంది. దీనికి శ్రీ అరవిందుని జీవి తమే తార్కాణం. యిది బుచ్చిబాబుగారికి యెంతైనా వర్తిస్తుంది.

చర్చలో తర్కించడమేకాని తార్కికమైన గరిడీలు, సాములుచెయ్యరు. వాదంలో పేచీలుపెట్టుకొని ఖండించకుండా తమాషాగా నాజూగ్గా తప్పుకునేజాణ తనంవుంది. కాని ఆదేవిషయాన్నిగూర్చి. యేకాంతంలో వితర్కించుకొని, లోతులు తరచి, తరవాత,నాలుగుముక్కల్లో తనఅభిప్రాయాన్ని పొందుపరచడంకూడాకద్దు.

ఆయన రచనలను విశిష్టమైనవిగా భావించడానికి కారణం-శైలి, భావ ప్రకటన, కథ చెప్పేనేర్పూ, వర్ణనలూ- వీటికంటే మించి. ఆ కథలవెనుక పొందు పరచిన మూల సూత్రాలు. మన నిత్యజీవితంలోని సంఘటనలకి, చేష్టలకీ వెనుక దాగివున్న మూలసూత్రాలు- వాటిని అలాంటి చేష్టలలోకి అన్వయించి చూపటం అదీ ఆయన విశిష్టత. వక మామూలు చేష్ట వెనుక ఆధారయుతంగా వున్న జగత్ సూత్రాన్ని అన్వయించి చూపటంలో ఆయన తరవాతే యెవరినైన పేర్కొన గలను.

వో కథలో. వో అమ్మాయి-తిరుగుతున్న పంకాని చేతివ్రేళ్ళతోనో, పుల్లతోనో ఆపబోవటం, వేళ్ళకి గాయం అవటం-చివరకి కదిలిపోబోతున్న విమా నం ముందు రెక్కల్ని ఆపబోయి చనిపోతుంది.

తిరుగుతున్న టేబిల్ ఫాన్‌లో వేళ్ళుపెట్టాలనిపిస్తుంది అందరికీ చెయ్యి పంకావరకూ పోనిస్తాం. రెక్కలకు తగిలీ తగలనట్లుగా అన్చబోతాం వేళ్ళని. వేళ్ళు విరిగిపోతాయని తెలుసు. అంతటితో ఆగిపోతాం. కాని ఆ కోర్కె, ఆ అభి లాష త్రోసివుచ్చరానిది దానిలో వో జగత్ సూత్రం యిమిడి వుంది. విశ్వపు చలనాన్ని. లయని వక క్షణంపాటు నిలపాలనీ-చలనం నిలిచి-అనిర్వచనీయమైన

చేతనా చేతనాతీతమైన వో సిద్ధిని పొందాలనన్నలాలస- అదీ ఆ కథలోని భావం.

నిశ్చలంగా, నిదానంగా, తాపీగా కనిపించే ఆయనలో వో అంతర్లీనమైన వేగం, సాంద్రత- ఆ వేగాన్ని చటుక్కున ఆపి, మళ్ళీసాగిపోవాలనీ, సాంద్రతని గాలి బుడగలా యెగిరించాలనీ- ఆయన చూపులో కదిలికలో కనిపించేవినాకు.

చివరి రోజుల్లో, 'యేమిటి 'యీ' అస్వస్థత!' అని గురిజాడ అప్పారావు గారిని అడిగితే, లేనిదే మధురవాణిని సృష్టించ గలిగాననంటావా!' అని జవాబిచ్చి నట్లు చెబుతారు-

వుద్యోగం రీత్యానో, కేవలం డబ్బుకోసమో, రచయిత ననిపించు కోవటం కోసం రాయడం ఐతే చెప్పలేనుగానీయే సృజనీయ రచనైనా ఆ రచయిత అంతరంగానికి ముడిపడి వుంటుంది రచయితకీ అలాంటి తన రచనకి మధ్య వో ప్రగాఢమైన అనుబంధం వుంటుంది. రచనలలో విహరించే సంఘటనలు చేయించే చేష్టలు, కల్పించబడే వ్యక్తులు ఆ రచయితకి సంబంధించక పోవచ్చు అదంతా కల్పనే కావొచ్చు. కాని అదొక అపురూపమైన కల్పన; దానివెనక దాగివున్న కొన్ని మూలసూత్రాలకీ అన్వయించబడిన కల్పన. అలాంటి మూలసూత్రాల ప్రభావం రచయిత అంతరంగ జీవితంమీద గాఢంగా వుంటుంది. (ఐతే తను వాటితో ఏకీభవించక పోవడం అన్నది వేరు మాట.)

ఆయన్ని యెప్పుడూ నేను విలేఖరిలా యేదీ అడిగితెలుసుకోవాలనుకో లేదు. యే విషయాన్నిగూర్చి ఆయన్ని తన అభిప్రాయం చెప్పమని అడగలేదు. వుట్టినే ప్రస్తావించేవాడిని మాటలసందర్భంలో. చర్చలోంచి- కొన్నికొన్ని విశదం అవుతూవుండేవి ఆయన మాటలదర్పణంలో నా రూపు దిద్దుకున్నాను.

సంవత్సరంక్రితం 'ఎల్లోరాలో యేకాంత సేవ'పై వ్యాసంవ్రాసి వో సాహిత్య మాసపత్రికకి పంపిస్తే. నేనుపంపినతరువాత అది నిలిచిపోయినట్లుంది. వ్రాతప్రతికూడా తిప్పిపంపలేదు. మరోప్రతితయారుచేసి కొద్దినెలలక్రితం వోసుప్రసిద్ధసాహిత్య మాసపత్రికకి పంపించాను. యింతవరకూ దానిని వారేమిచెయ్యదలచినదీ వారికే తెలియాలి తెలిస్తే. యింతలో అంతవాక్తవింటాననితెలిస్తే ఆయనకే పంపివుందుకదా! ఆయన చూస్తే, చదివితే. యేమిటో, అదోతృప్తినాకు.

దేనినిగూర్చి తాపత్రయపడేవారు కాదు. వక ప్రశాంతి నెలకొల్పుకు

స్నారు. అది బాహ్యజగత్తులో అలంకరించిపెట్టినదికాదు. అది తనలోని ప్రశాంతి. బాహ్యజగత్తులో అలంకారంచేయించినదైతే, పుట్టినే తళుక్కుమని జీవరహితంగా వుండిపోతుంది తనలోనిప్రశాంతతే తనచుట్టూఅలముకునేది. ఆ ప్రశాంతవాతావరణంలో గడిపినక్షణాలు యెంతమధురమైనవి! యెంత అమూల్యమైనవి! కాని, ఆయనలో యెంతటితపన, యెంతటితృష్ణ! సృజనీయ కళాకారుడితపన ఆయనని యెంతగానో దహిస్తుండేదని నాకనిపిస్తుండేది. ఆ చూపులో ప్రస్ఫుటంగా కనిపించేది. ఆ సృజనీయావేదన ఆయన జీవించినకాలం, దేవతలు కళకోసం ప్రసాదించిన పవిత్రక్షణాలా! అన్నట్లు అనిపిస్తుంది.

హైదరాబాదులో అఖిలభారత ప్రదర్శనలోకలిసి నడచిన అడుగుజాడలింకా చెరగనేలేదు. బెజవాడలో, 'అంతరంగ కథనం' వ్రాయబోతూ ఆయన చెప్పిన తన చిన్ననాటి మాటముచ్చటింకా నాకు పాఠనేలేదు. వారియింటచేసే యిష్టాగోష్టిలోకొసకి రానేలేదు.

'అరకులోయలో కూలిన శిఖరపుఛాయలింకా మాసిపోనేలేదు; 'కలలో జారిన కన్నీటి'తడి యింకా ఆరనేలేదు; 'మనసులో మారుమూలల' మమతలపచ్చిదనం యింకా విచ్చనేలేదు. 'అంతరంగకథనం యింకా ముగియనేలేదు.

ఇవన్నీ మీ కిచ్చానుకదా; యేమీలోపంచెయ్యలేదుకదాఅన్నట్లుగా వెళ్ళిపోయారు- 'గాజుమేడ'లోంచి తననికూడా చూసుకోమని.

మేధస్సుచెబుతుంది; జ్ఞానం వివరిస్తుంది; వాస్తవం రూఢిచేస్తుంది-లేరని, మననివిడిచివెళ్ళిపోయారని. కాని హృదయం అంగీకరించలేదు. అది మాటకందని మూగబాధ.

మనకింక లేరట మన బుచ్చిబాబు.



# వయసు నొసలుపై ముసలి రేఖలు

—బుచ్చిబాబు

[ఈ అసంపూర్ణ, అముద్రిత కథ బహుశా బుచ్చిబాబుగారి ఆఖరి రచన. ఈ కథను బుచ్చిబాబుగారయితే ఎలా ముగించి వుండేవారో ఊహించి ఆయన పద్ధతిలో వ్రాసి పంపవలసినదిగా కథకులను కోరుతున్నాము. మాకు తృప్తికరంగా ఉన్న రచనలను వచ్చే సంచికలో ప్రచురిస్తాము. సం॥]

మనం పురోగమిస్తున్నాం అనిపిస్తుంది. మామూలుగా క్షౌర శాలల్లో వేచివుండే వ్యక్తులకాలక్షేపానికై ఒక బల్ల మీద బోలెడన్ని పత్రికలు వుంచుతారు- వారపత్రికలు, మాసపత్రికలు, సినిమా పత్రికలు- ఓ మీ చిత్తం. వీటిల్లో కొన్ని పాతవే అవొచ్చు. కాని కాలక్షేపానికి ఇవి చాలు. ఈ పద్ధతి కొన్ని హోటళ్లల్లోకూడా చూశానుగనుకనే, పురోగమిస్తున్నాం అని మొదలెట్టాను. ఆ హోటలుకి వెనక వరండావుంది. అందులో నాలుగైదు బల్లలు, వాటిచుట్టు కుర్చీలు, పక్కన ట్రేబల్లలమీద పన్ ట్రేలు, పత్రికలు ఉదయం ఎనిమిది దాటిందేమో. దూర దూరంగా బల్లలచుట్టూవున్న కుర్చీలమీద ఐదారుగురు అల్పాహారాలు సేవిస్తున్నారు. మూలగా మొక్కల తొట్టెలవెనకనున్న బల్లముందు కుర్చీమీద కూర్చుని పంకావాలో సర్వర్‌కి నివేదించుకొని పైనున్న పత్రిక చూడ్డం మొదలెట్టాను. ఏదోదేశంలో యుద్ధం జరుగుతోంది; విపణివీధి; ఉద్యోగాల ఖాళీల వివరాలు; అమ్మకానికున్న ఇంటి భోగట్టా; సర్వరోగనివారిణి-ఫలానా మందుదొరికేచోటు; పాతికవేలు అప్పు దొరికితే, కొత్త వ్యాపార సంస్థ నెలకొల్పుతానని బెదిరిస్తూ వొక పారిశ్రామికుని ప్రకటన; నాటకాల పోటీలో మొదటి బహుమతి నందుకున్న యువకుని ఫోటో; ఏదో పంచా

యతీ భవనం ప్రారంభోత్సవం తాలూకు ఫోటో; నూతన వధూవరుల ఫోటో; సినిమా 'ఎడ్వర్ టైజ్ మెంట్' చిత్రాలు-ఆ పత్రిక మూడోపుట తిరగవేస్తుండగా. ఎవరో వొచ్చిన అల [illegible] వుంచి, ముందుగా కూర్చున్నవ్యక్తిని చూశాను. ఇంకెక్కడా కుర్చీ ఖాళీ లేక, నా బల్లదగ్గరకొచ్చి కూర్చున్నాడనుకున్నా. పక్క బల్లమీదున్న పత్రికల దొంతరలో. అడుగునున్న పత్రికని పెల్లగించి, పుటలు తిప్పి, నాకు మొహం కనబడకుండా పరిచి, చదువుకుంటున్నాడు. నేను తిండిలో పడినా అతనికేసి చూస్తు నేవున్నాను. వయస్సు పాతికలోపు. కింద కాలి మర మని అనుకునే టెరిలిన్ పాంట్-నలుపు రంగుది-పైన వెడల్పాటి బెల్టు, పాంట్ లోమడిచిన షర్టూ-హాఫారం-అవీ అతను ధరించిన దుస్తులు. మంచి దట్టంగా ఎదిగి. బలంగా నొక్కిపెట్టిన ఉంగరాల జుట్టు-వెనక్కిదువ్విన క్రాసింగ్-వాజిలైనో. ఏదో తైలమో తగలని భాగాలు పైకి వొ పుతి గిన వెంట్రుకలు-చామన ఛాయ కుఱ్ఱవాడే-కళైన మొహమే-కాని నుదుటిమీద, నడుమ, అడ్డంగా రెండు మడతలు-గీట్లున్నాయి. ఈ నుదుటి మీదిగీట్లని, నడివయస్సుదాటి వార్ధక్యంలోపడ్డవారి మొహంలో చూస్తాం. సాధారణంగా జీవితంలో తిన్న ఢక్కామొక్కీలకీ, గుర్తు ఈ గీటు. 'అనుభవం' అనే దేవత మనిషిమీదినుంచి నడిచివెళ్ళి, నడివయస్సు దాటాక, పరుగు లంగించుకుని, కాలుమడతపడి, మొహంమీద బోర్లగిలపడితే, పడ్డ డాగు, ఆగీటు. వార్ధక్యంలో, వృద్ధుడి మొహానికి, శిలాన్ని ఆపాదిస్తుంది ఈ గేటు అంటారు. యువకులలో వీటిని చూడం. కాని నా ఎదురుగా వున్నవ్యక్తి మొహం, ఈ రెండు గీట్లవల్లనే నాకు అందంగా కనబడసాగింది. ఎందుచేతనో!



క థ

# గానుగెద్దు జీవితాలు

—సోదుంజయరామ్

మసక మసకగా వెలుగుతున్న లాంతరుముందు కూచుని వాసమూర్తి ఏదో చదువుకుంటున్నారు. పక్కమీదపడుకున్న అనూరాధకు నిద్ర రావడంలేదు. మాటిమాటికి అటూ, ఇటూ దొర్లుతోంది- లాంతరు ఆర్పనందుకూ, ఇంకావక్క చేరనందుకూ అనూరాధకు చిరాకుగావుంది. ఏ కాసింత వెలుతురున్నా, తనకు నిద్ర రాదు. వాసమూర్తి రాత్రిళ్లు గంటలతరబడి చదువుతూ కూర్చుంటాడు. అలా చదువుతూ కూర్చోవడంలోవున్న ఆనందం వాసమూర్తికే తెలియాలి ఇట్లా నిద్ర కాయడమంటే తనకు తలప్రాణం తోకకువస్తుంది ఇవాళ్ళ మనసు మరీ అదోరకంగావుంది కళ్ళుమూసి పడుకుంటే కాస్త ప్రశాంతంగా వుంటుంది; వాసమూర్తి ఇంకాఎంతసేపు కూర్చుంటాడో ఆ లాంతరుదగ్గర!

'చాలాపొద్దుపోయింది. లాంతరుఆర్పి పడుకోండి' అందామన్న ఆలోచన మనసులోకి వచ్చింది అనూరాధకు. కాని అనడానికి మనసులో ఏదో సంకోచము వాసమూర్తి ఏమన్నా అనుకుంటాడనికాదు. ఇవ్వాల భోజనాలముందు వాసమూర్తితో కొంచెం ఘర్షణ జరిగింది. నిజానికి దాన్ని ఘర్షణ అనడానికి కూడా వీలులేదు. ఇద్దరుమాటామాటాఅనుకుంటే అది ఘర్షణ వాసమూర్తి నోరెత్తనే లేదు కేవలం తనుమాత్రమే నోరుచేసుకుంది. చాలాగట్టిగా నోరుచేసుకుంది. వాసమూర్తి నోరెత్తలేదు. ఆశ్చర్యంగా తలెత్తి, తనవైపొకసారిచూచి తలదించుకున్నాడు. మనసులో ఎంతబాధపడ్డాడోఏమో. అయినా తనకీమధ్య మరీ నిగ్రహం లేకుండాపోతోంది. కాసింతకూ, కూసింతకూ కూడా చిరాకు కలుగుతోంది. నిజానికి ఇవ్వాళ వాసమూర్తిని అంతలేసిమాటలని బాధపెట్టాల్సిన కారణంగూడా లేదు. తను అన్నంవడ్డిస్తోంది. "ఏంకూర వండావు అనూ ఇవ్వాళ "అన్నాడు. అది ఆయన మామూలుధోరణి. ఇంట్లో బెడలులేక పప్పుచెయ్యలేదు. ఉల్లిగడ్డలసాంబారు చేసింది ఆ మాట సవ్యంగా జవాబుచెప్పవచ్చు; తనతో ఏ భూతం ఆవేసించిందో

ఆ క్షణాన, తారాజువ్వలా చర్రునలేచింది తను.

అంతా అసంబద్ధ ప్రేలాపన ఆయన అసమర్ధతకీ తన దౌర్భాగ్యానికిముడి పెట్టి నానా హంగామాచేసింది, ఆయన గమ్మునకూర్చొని, యాంత్రికంగా భోజనం ముగించాడు. తనకి అన్నంకూడా సహించలేదు. మనస్సంతా వికలమై పోయింది.

వాసమూర్తి ఏమీ జరగనట్టే, నిర్వికారంగా కూచొని చదువుకుంటున్నాడు, బహుశా అంతా మరిచిపోయి వుంటాడు ఆ సహనం ఎట్లా అలవర్చుకున్నాడో వాసమూర్తి!?

అనూరాధ రెస్ట్‌లెస్‌గా అటువైపు దొర్లింది. వాసమూర్తిని గూర్చి, ఆయన సహనాన్ని గూర్చి, ఆలోచించడానికి మనసొప్పలేదు. కిటికీలోంచి బయటకీ చూచింది. రాజగోపాలం గారింట్లో ప్రకాశవంతంగా బార్‌లైట్లు వెలుగుతున్నాయి. లైట్లకాంతిలో ఇంద్రభవనంలా ఉన్న యిల్లు అనూరాధకు ఆ యింట్లో వున్న వస్తుసముదాయమంతా కళ్ళముందు మెదిలింది. రేడియో-ఖరీదయినసోఫాలు అద్దాల బీరువాలు- బీరువాలనుండా కళ్ళు జిగేలుమనే బట్టలు. పట్టెమంచాలు-పాన్పులు-ఒక చేమిటీ-అన్నీ వున్నాయి. రాజ్యలక్ష్మి అదృష్టవంతురాలు. ఆమె భర్త రెండు చేతులా సంపాదిస్తున్నాడు. వాసమూర్తిలా రాజగోపాలం ఆఫీసు గుమస్తాకాదు ఏదోవ్యాపారం, డబ్బుకు కొదవలేదు, బాగా అనుభవిస్తున్నాడు. పుణ్యం కొద్దీ పురుషుడన్నారు అది రాజ్యలక్ష్మి అదృష్టం.

రాజ్యలక్ష్మిగారు ఈ మధ్యేదిగారు ఆ యింట్లో, కొత్తగా యింట్లో దిగగానే ఆమె వచ్చి పలకరించింది. బెనారస్ సిల్కుచీర, మెడలో జిగేలమనేరవ్వల నెక్లెస్, ఠీవిగా. దర్పంగా, ఇంట్లో అడుగుపెట్టిన రాజ్యలక్ష్మిని చూచి తాను వంచించుక పోయింది. ఆమెకు ఏం మాట్లాడాలో, ఎలా గౌరవించాలో, తెలియక తికమక పడ్డది. ఖర్మ! ఆవిడను కూర్చున బెట్టేందుకు ఇంట్లో ఒక కుర్చీ అయినా లేదు ఎలాగో మంచం వాల్చింది కానీ, ఆవిడ కూర్చోలేదు. ఉన్న కాసేపూ, అలాగె నిలబడి ఉంది. నిలబడే ప్రశ్న పరంపర కురిపించింది. మీవారేం చేస్తారు? జీతమెంత? ఇంటిదగ్గర ఆస్తిపాస్తులేమన్నా ఉన్నాయా? ఇంత తక్కువ జీతంలో ఎలా సంసారం దిద్దుతున్నావ్?

అన్నీ ఇట్లాంటి ప్రశ్నలే. అన్నీ తన లేమిడిని బట్టబయలుచేసే ప్రశ్నలు. బోనులోవున్న ముద్దాయిలా సమాధానం చెప్పవలసివచ్చింది. ప్రతీసమాధానం లోనూ, తన ఆత్మాభిమానం దెబ్బతింది. రాజ్యలక్ష్మి వెళ్ళేముందు 'అదేమాయిల్లు లేపోసారి రండి' అన్నది. అనూరాధ మౌనంగా తలూపు, తలువువరకు వెళ్ళి సాగ నంపింది.

రాజ్యలక్ష్మి వెళ్లగానే పెద్ద నిట్టూర్పువిడిచింది. ఏంపనిచెయ్యడానికి తోచలేదు. నిశ్చలంగా కూర్చొని, తనలేమిడినిగూర్చి తలపోసుకోసాగింది ఎంత నికృష్టంగాబ్రతుకుతోంది తను. జీవితంలో, సంతృప్తి, శాంతి సుఖం—అన్నీ దూర మయ్యాయి. పెళ్ళిగాకముందు కన్న కలలన్నీ, కళ్ళముందే కరగిపోతున్నాయి. అవును ఆ రోజుల్లో— ఎంతమంచికలలు! ఆ కలలని ఇప్పుడు జ్ఞాపకంచేసుకోవాలన్నా భయమౌతుందీ. తనజీవితానికి మిగిలిందే భయం. తనకు ఎవర్నిచూసినా భయం. అంతా తన్ను న్యూనతపరుస్తారు. అవహేళనచేస్తారు. చుట్టూ, అంతా రాజ్యలక్ష్మి లాటి వారున్నారు. వారికి తనలాటి వారిని—అవమానిస్తేతప్ప, బాధిస్తేతప్ప తృప్తిలేదు.

మొన్న ఆ నాగరాజ్యం కూడా అలాగే మాట్లాడింది. ఆవిడ భర్త కం ట్రాక్టరు, కూలీల కడుపులుకొట్టి, పాపిష్టి డబ్బు కూడబెట్టాడు. ఆ డబ్బు చూచి నాగరాజ్యం అతిశయం, డబ్బులేనివాళ్ళు, ఆవిడ దృష్టిలో హీనాతి హీనం, వాళ్ళను అవమానించి, బాధపడుతుంటే చూడటం ఆవిడ ఆనందం! ఆవిడ నోరు కదిపితే బాణాల్లాటి మాటలు, ఎదుటి మనిషి గిలగిల తన్నుక చావాలి. బాణం దెబ్బకు పక్షి పడితే వేటకాడు చూచి ఆనందించినట్లు ఆనందిస్తుంది.

ఒక్కరైకు ఏం తోస్తుంది ఇంట్లో? రేడియో కొనలేకపోయాడామీఆయన? బోసిమెడన ఎలా వుంటున్నావమ్మా, వంటిపేట గొలుసన్నా చేయించుకోలేక పోయావ్?

ఇలాసాగింది ఆవిడ ధోరణి. నగలూ, రేడియోలు కొనగల స్థోమత తనభర్తకుందోలేదో నాగరాజ్యానికి తెలుసు. తెలిసీ, తన దౌర్భాగ్య స్థితిని ఎత్తి చూపడం ఆవిడ లక్ష్యం.

ఇట్లాంటి సంఘటనలు జరిగితే తనకు పుండుమీద కారం జల్లినట్లుంది, అనుకోకుండానే వాసమూర్తిమీద ఏవగింపు కలుగుతుంది. నాగరాజ్యం భర్తలాగ

వాసమూర్తి కంట్రాక్టరు అయి వుంటే బాగుండు. రాజ్యలక్ష్మి భర్తకులాగ వ్యాపారంవున్నా బాగుండు. కానీ వాసమూర్తి కేవలం గుమస్తా గుమస్తా అయినందుకు వాసమూర్తి మీద గొంతుదాక వస్తుంది. ఆ కోపాన్ని, అంతరంతరాల్లో అణగార్చడం చేతకాదు, అందుకే అడపా, దడపా చిరాకు, కోపం, అసహ్యం, అన్నీ వాసమూర్తి మీద కుమ్మరిస్తుంది

అనూరాధ కళ్ళు తెరచి వాసమూర్తివైపు చూచింది. చదవడం చాలించి, గోడకి చేరగిలబడి సిగరెట్టుపీలుస్తున్నాడు భోజనాల దగ్గర తను చేసిన ధూం, ధాం ను గురించి ఆలోచిస్తున్నాడేమో! నిజంగా వాసమూర్తే తన స్థితికి? వాసమూర్తి దోషమేముంది ఇందులో? అంతా తన రాత! పూర్వజన్మ సుకృతం మనసు వికలమై-నిష్కారణంగా వాసమూర్తిమీద పడుతుంది తను- అనురాధ భారంగా నిట్టూర్చి కళ్ళుమూసుకుంది. కాసేపట్లో నిద్రలోకిజారింది.

వాసమూర్తి గోడకి చేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు. మనసులో తెరపిలేని ఆలోచనలు ఇందాకా పుస్తకం చదువుతూ కూచున్నాడు. కానీ-ఒక్కముక్కా బుర్రకెక్కలేదు. వూరికే పేజీలు తిప్పుతున్నాడు. మాటిమాటికీ అనురాధ కళ్ళముందు మెదలుతోంది అవును అనురాధ తనకి ఒక సమస్య అయిపోయింది తల బద్దలుకొట్టుకున్నా తెగని సమస్య.

ఇవ్వాళ తను నిజంగా స్తంభీ భూతుడయ్యాడు అంతరాంతరాల్లో పశుత్వం విజృంభించింది. కుతికెదాకా వచ్చింది. మళ్ళీ తమాయించుకున్నాడు. అనురాధ ఏదో అవివేకంగా ప్రవర్తిస్తే, సభ్యతా సంస్కారమున్న తనూ అలా ప్రవర్తించడమేమిటి. తను ఓరిమి వహించడం మంచిది. ఈ ఆలోచనతోనే తను అవాక్కయిపోయేడు.

కాని ఇవాల్టి సంఘటన మొదటిదికాదు, ఇకమీదట అనూరాధ ఇట్లా ప్రవర్తించదు అన్న నమ్మకం లేదు, ఈ అశాంతి-అలజడి - ఎన్నాళ్ళని భరించగలడు? జీవితం పట్లా. తనపట్లా, అసంతృప్తి తప్ప అనూరాధకి మరొకటిలేదు. ప్రతిక్షణం సాఫుగా అనూరాధ ఆ విషయం వ్యక్తపరుస్తోనే వుంది.

తను అసమర్థుడు. తనమూలాన అనూరాధకి అన్నీ కష్టాలే. బ్రతుకులో సుఖంలేదు శాంతిలేదు ప్రపంచంలో అంతా సుఖపడి పోతున్నారు. ఒక్క అనూరాధ తప్ప! దానికి కారణం తను!!

వాసమూర్తి సిగిరెట్టు వెలిగించాడు. కళ్ళుచెమ్మగిల్లాయి. ఇట్లాంటి అనూరాధతో- తను జీవితం నడపాలి.తను ఆశించింది ఈ జీవితంలో ఈషణ్మాత్రమూ లభ్యంకాదు. తనకు లభ్యమయ్యేది కేవలం శారీరక సౌఖ్యం. ఆ సౌఖ్యాన్ని డబ్బుతీసుకొని పంచేవాళ్ళు చాలామంది వున్నారు.

కాని తను ఆశించిందివేరు. హార్థికమూ, అనురాగమిళితమూ, అయిన దాంపత్యసౌఖ్యంకావాలి. అదేలోపించింది తన జీవితంలో. దానికోసం అనూరాధకు తను ప్రతిఫలం చెల్లించాలి. కానీ తనకు అదిసాధ్యం కాదు.

ఏముంది తనచేతుల్లో? వందయాభై రూపాయలకు అమ్ముడు పోయిన బానిస తను. బంగళాలూ, కార్లూ, ఏమీలేవు. ఇకముందు వుంటాయన్న భరోసా లేదు. గొర్రెతోక జీవితం. దీనిలో ఎదుగూ, బొదుగూ ఆశించడానికే ఆస్కారం లేదు. అవును అనూరాధలో కూడా మార్పు వుండదు. ఆవిడకు ఎప్పుడూ అసంతృప్తిగావుంటుంది. అనూరాధ కోరుకున్నవి ఈ జీవితంలో ఏమీ దొరకవు.

వాసమూర్తి గొంతుకలో ఏదో ఉండలా అడ్డుపడ్డది. జీవితమే నిస్సారంగా కన్పిస్తోంది. అనూరాధకు కావలసింది తనుకాదు, తనిచ్చే సౌఖ్యాలు కావాలి. ఆసౌఖ్యాలు లభ్యంకాక తనపట్ల అసంతృప్తి.

అనూరాధ-తన్నుకాక—మరొకని పెండ్లాడ వలసింది. ఆవిడకు జీవితం నూడు పువ్వులు ఆరుకాయలుగా వుండేది. ఆవిడ దురదృష్టం అలా జరగలేదు. 'మ్యారేజెస్ ఆర్ మేడిన్ హెవెన్' నిజమేకాబోలు.

వాసమూర్తి దృష్టిలో గతం మెదిలింది. ఏ పరిస్థితిల్లో అనూరాధకూ, తనకూ ముడిపడ్డదో వాసమూర్తికి తెలుసు. అనూరాధ తండ్రి అనూరాధ కోసం ఖరీదైన వరుణ్ణి, కారు చౌకలో తేవాలని- ఎంతగానో ప్రయత్నించాడు. ఆడపిల్లలి తండ్రులకున్న ఆశే ఆయనకూ వుండేది. డాక్టరునో. ఇంజనీరునో— అనూరాధ కోసం సంపాదించాలని ప్రయత్నం. చేతిలోవున్నది పదివేలు. ఆయనకున్న ఆశకూ ఎక్కడా లంకె కుదరలేదు. పదేళ్ళ ప్రయత్నం తర్వాత "దీనికా రాతలేదు. అందుకే కలిసిరాలేదు" అని అంతా అనూరాధ రాతమీదత్రోసి- తన సంబంధం పెట్టుకున్నాడు.

తనకూ-అనూరాధకూ రాసిపెట్టివున్నదేమో. తనంటే ఇష్టం లేని

అనూరాధ—తనపాలిట పడ్డది. తన జీవితాన్ని నరక తుల్యం చెయ్యడానికి సిద్ధపడు తోంది!

అనూరాధకి తనంటే ఇష్టంలేదు. తనంటే ఇష్టంలేని అనూరాధ-తనకిష్టం లేదు. చిత్రం! ఇష్టాల ప్రసక్తిలేకుండానే- తమ దాంపత్యం సాగిపోతుంది అవును అది ఇలా సాగిపోతూనే వుంటుంది. తనంటే ఎంతయిష్టము లేకపోయినా— అనూరాధ తన్నువిడిచి పోలేదు. ఎక్కడికి పోతుంది? పొట్ట పోషించుకునేందుకు- చదువూ—ఆస్తీ - ఏమీలేవు. ఏమీలేకుండా ఏం చేస్తుంది? తనే మగవాడయి వుండీ- సంకటావస్థలో పడుతున్నాడు. ఒకటి రెండుసార్లు- దీనికి ఏదోపరిష్కారం ఆలో చించాలనుకున్నాడు. ఏమిటి పరిష్కారం?

అనూరాధతో స్పష్టంగా చెప్పాలి, "మనలో ఇష్టంలేని దాంపత్యం వ్యభిచారంకన్నా ఘోరం. విడిపోవడం-నీకూ, నాకూ ఇద్దరికీ శ్రేయస్కరం"

ఈ మాట తననోటంట అనూరాధ వింటే- ఇలైగిరి పోయేట్లు ఏడుస్తుంది కాబోలు. ఏడుస్తూనే 'మీరంటే నాకు ఇష్టంలేదని ఎవరన్నారు? అంతా వక్రీ అబ ద్ధం అన్నీ మీరే కల్పించుకుంటున్నారు." సందేహంలేదు. ఈ మాటలే వస్తాయి అనూరాధ నోటంట. బ్రతుక్కి గ్యారంటీలేని ఏ ఆడదయినా ఆ మాటే అంటుంది ఏం చెప్పగలడు తను? అనూరాధతో అవసరం లేకుండా ఏకపక్ష నిర్ణయంచేస్తే సంఘం ఇచ్చేతీర్పుకు తను తట్టుకోగలడా? అనూరాధని, సీత, సావిత్రిలాంటి పతివ్రతల కోవలోకి చేర్చి- తన్ను కేవలం- ఒక రాక్షసుడి కింద జమకడుతుంది సంఘం. అగ్గిలాంటి ఇల్లాలిని అన్యాయంగ వదిలివేశాడంటుంది. తను ఏం జవాబు చెప్పగలడు? ఋజువేమిటి? హృదయంలో వున్న గాయాల్ని ఎలా చూపగలడు?

లేదు. దీనికి పరిష్కారమార్గంలేదు ఇష్టమున్నాలేకపోయినా కాపు రం సాగించి తీరవలసిందే అనూరాధ-తను ఇద్దరూ వలలో చిక్కుకున్న చేపలు. ఎంత గింజుకున్నా వలవదలి పోలేరు. బలమైన వల ఛేదించ శక్యంకానివల! జీవితాంతం-విలవిలా గింజుకు చావాలి!

ఆలోచనలతో వాసమూర్తి తల వేడెక్కింది. లేచి నిల్చున్నాడు. అనూరాధ పడుకుని నిద్రపోతోంది. పైట పక్కకి తొలగింది. ఎత్తయిన రొమ్ములు, ఉచ్ఛ్వాస, నిశ్వాసాలకు కిందికీ పైకీ లేస్తున్నాయి. వాసమూర్తి లాంతరుఆర్పి, మంచం దగ్గరికి వెళ్ళాడు. పడుకోవడానికి అనూరాధని కొంచెం

పక్కకి వత్తిగించాడు. స్పర్శకు అనూరాధకు మెలుకువ వచ్చింది. ఇటువైపు తిరిగి మత్తుగా, వాసమూర్తి మీద చెయ్యివేసింది. కిటికీలోంచి ఈదురుగాలి వీస్తోంది. వాసమూర్తి అనూరాధని దగ్గరికి తీసుకున్నాడు. వెచ్చటి స్పర్శ! కాసేపు ఆ హృదయాలలోని అశాంతి, అలజడి - అన్నీ మాయమయ్యాయి.

---

చర్చా వేదిక:

# జీవితానుభవంలో హేతవాద దృష్టి

"మానవుడు పరిసరాలను మార్చుకొనటంలోనే తనూ మారతాడు. వాటినిమారుస్తాడు అభ్యుదయశీల దృక్పథం యిదికాదా?"

జీవితానుభవంలో హేతువాదదృష్టి అనే శీర్షికతో సురమౌళిగారు ఆరంభించినచర్చలో పాల్గొంటూ యస్ గోవిందరెడ్డిగారు చివరకువేసిన ప్రశ్నయిది యీ ప్రశ్నచెబుతున్న సమాధానంలో యిమిడివున్న సూత్రీకరణ. సిద్ధాంతీకరణ పాక్షికసత్యమే. సురమౌళిగారు సమాజాన్నించి తనని విడదీసుక చూస్తున్నారనేది బలంగా చక్కగాచెప్పగలిగిన గోవిందరెడ్డిగారు మార్క్సుని పట్టకొని వ్యక్తిని సమాజంతో కలిపేసి, మానవుల మానవ సంబంధాల ప్రతిబింబమే సమాజం అనే సత్యాన్నిచూడటం పోగొట్టుకొని సమాజాన్ని వ్యక్తికి సంబంధంలేని *abstract thing* గా జేసి (ఆస్తికులు దేవునిలాగా) అందువల్ల, పోరాడాలంటూకూడా వ్యక్తి యొక్క కృషికి అస్కారంలేకుండా వ్యక్తిని నిర్వీర్యుని చేయటమవుతున్నది

అసలు చర్చాశీర్షికకూ గోవిందరెడ్డిగారు ముగింపుద్వారా తీసుకొచ్చిన వారి మొత్తం వ్యాసపు సారాంశానికి భేదంవుంది. ఏది అభ్యుదయశీల దృక్పథం అనికాదు యీ చర్చ.

హేతువాదం అంటే ఏమిటి? జీవితానుభవంలో హేతువాదదృష్టి ఎలా ప్రతిఫలించుతుంది అనేది చర్చగా భావిస్తున్నాను నాస్తికత్వమే హేతువాదమని చెబుతున్నారు సురమౌళిగారు. తను నాస్తికుడుగనుక హేతువాదినని నిరూపించు

కొంటున్నారు. కాదని నా వాదన. నాస్తికత్వమూ ఒకసిద్ధాంతమూ, అందునా పిడివాదసిద్ధాంతమూనని, అది నిరంతరపరిశీలన, నిత్యాన్వేషణ నిష్పాక్షిక పరిశోధన లేకుండా చేస్తుంది, చేస్తున్నది అని నా వుద్దేశం. ఈ సారి 'సృజన'లో శ్రీశ్రీగారి వ్యాసంలో ఆధ్యాత్మికచింతన అని వాడుతూవచ్చినపదంలో ఆయన యిచ్చుకొచ్చిన అర్థాన్నే నేను హేతువాదం అనే పదానికి యిస్తున్నాను. ఆ వ్యాసంలో వారు వీరేశలింగం, గురిజాడలనించియిచ్చిన ఉదాహరణలుకూడా హేతువాదానికి ఉదాహరణలుగా తీసుకొనవచ్చు

ఒక సకలాతీతశక్తి వున్నట్టా? లేనట్టా?

ఉన్నట్టు అని ఆస్తికత్వం, లేనట్టుఅని నాస్తికత్వం చెబుతాయి. ఉన్నట్టా? లేనట్టా? అని అడిగేది, చూచేది, ఆలోచించేదీ, అన్వేషించేదీ హేతువాదం. యీ అన్వేషణ ముగియాలనీ, యేదో సమాధానానికి వచ్చేయాలనీ త్వరపడదు. *serious mind.* యిదొక ఉదహరణే. ప్రతిముఖ్యమైన మౌళికమైన సమస్యలోనూ *easy and predetermined solutions* కి దిగకుండా అన్వేషణకూ నిష్పాక్షికంగా నిరావేశంగా చూచేందుకూ ఏదిదోహాదంచేస్తుందో దాన్నే హేతువాదం అంటాన్నాను. ఆ అన్వేషణలో, అనశీలనలో సామాన్య మనసు ఎక్కువకాలం నిలవలేక ఏదోవక పరిష్కారంకోసం తహతహలాడి నిర్ణయాలకొచ్చేస్తుంది. అంతటితో ఆ మనిషిలో మనసులో హేతువాదం అంతరిస్తుంది. అలా నిర్ణయాలకు వచ్చేసి హేతువును వదలివేయటమే ఆస్తిక, నాస్తిక, భౌతికవగైరా సర్వ సిద్ధాంతాలూ, మతాలున్నూ యీ వివిధవాదాలూ, మతాలలో ఒకదాన్ని వ్యతిరేకించుతూ యింకోదాన్ని హేతువాదానికి ఆపాదించటం స్వీయసమర్థనచేసుకొనటానికి హేతువాదాన్ని వక్రీకరించటం అవుతుంది అలాచేసేవారు తాము సరైన విజ్ఞానమార్గాన్ని చేబట్టకుండాచేసుకోవడమేగాక యింకా నల్గుర్ని వక్రమార్గానికి లాగినట్లవుతుంది.

—అట్లూరి రంగారావు.

★

సాహిత్యచర్చ:

# శ్రీ కుందుర్తి 'మహాప్రస్థాన' కావ్య మీమాంస.

—ఆర్వియార్

'సృజన' ఆగస్ట్-అక్టోబరు సంచికలో శ్రీ కుందుర్తి మహాప్రస్థాన కావ్యం మీద చేసిన ప్రారంభోపన్యాస పాఠం చాలా నిరాశావహంగా ఉంది. ఇది విమర్శ కాదని, చర్చనీయాంశాలని, తమకు తోచినవనీ, మనవిచేశారు. ప్రసంగ పాఠం కావడం వల్లనో ఏమో అది చాలా పేలవంగా వుంది. నవ్యదర్శన ఆవగింజంత కూడా లేకపోవడం అటుంచి, పదేపదే చెప్పబడినవి నలిగి పాత బడినవి వున్నాయ్. పొగడ్తలు తెగడ్తలు కూడా పాతవే. వీటికితోడు మీమాంస అంతా ఒక గందరగోళం అయింది.

చలం చెప్పినదానికి రాజకీయాలు జోడించి, మరీ ప్రమాదకారియై, "ఆచలమే నయమనిపించాడు శ్రీశ్రీ" అని నిగ్గుతీశాడు. చలం చెప్పిన దానికి శ్రీ శ్రీ రాజకీయాలు జోడించడం చాలా వింతైనపని. శబ్దవిరించికాదు, విరించికూడా ఆ పని చెయ్యలేదు. చలం 'Iconoclast' శ్రీ శ్రీ Revolutionary. చలం Romantic శ్రీశ్రీ Anti-Romantic. చలందీ వైయక్తిక పరిధి. శ్రీశ్రీది "ఈ విశ్వం సమస్తం" బ్రాహ్మణస్త్రీని ఒక ముస్లిం లేవతీసుకు పోయేటంత కసి చలానికి సమాజం పైన. "జన్మం చర్మం వెనకటి సాంప్రదాయమూ" నేటి సంఘస్థితులూ "నెరపే అసమానత"కి భౌతికకారణాలు అన్వేషించి సమాజ స్వరూపాన్ని మార్చప్రయత్నించేభౌతిక వాది శ్రీశ్రీ. శ్రీశ్రీ 'మహాప్రస్థానా' నికి చలం 'యోగ్యతా పత్రం' ఇవ్వడానికి ప్రధానకారణం శ్రీశ్రీలోని మహత్తర కవితాశక్తి. చిత్రమేమంటే శ్రీశ్రీ కవిత్వాన్ని మెచ్చుకొనే చలం, కావ్యవస్తువుని మెచ్చుకోలేదు. ఆ చలమె నయమని వెనక్కి తిరిగి వస్తారన్నప్పుడు భావోద్రిక్తతలో ప్రచండ ఝంఝాప్రభంజనంలాంటి వేగంతోవున్న శ్రీశ్రీ కవిత్వావేశానికి తట్టులేకపోతారనే అభిప్రాయంమాత్రమే. అంతకుమించి తాత్త్వికంగా వస్తువిషయకంగా కాదు (చూ. "శ్రీశ్రీ అర్ణవంలోపడండి పదండి

పదండిముందుకు. అగాధంలోంచి బయలుదేరే నల్లనిఅలలు మొహానకొట్టి ఉక్కిరి బిక్కిరై తుఫానుహోరు చెవులుగింగురుమని నమ్మినకాళ్లకింద భూమి తొలుచుకు పోతూవుంటే ఆ చలమే నయమని వెనక్కి పరుగెత్తి చూస్తారు '')

("యోగ్యతా పత్రం'')

శ్రీశ్రీ "ఛందోబందోబస్తులన్నీ ఛట్ ఫట్ మని'' త్రెంచివేయమని తానే త్రెంచివేయలేకపోయారని మరొక పాతనింద ఇక్కడ వచనగేయాన్ని ప్రస్తావించారు. వచనగేయోద్యమం వ్యాప్తి స్తే ఛందస్సుమీద మమకారం సడలుతుంది. ఛందోబద్ధంగా రాస్తే గ్రాంథికభాషావాసన వదల్దు. వచనగేయానికీ, వ్యావహారిక భాషకీగల సంబంధం గుర్తించకపోవడంవల్లనే ఈ ప్రమాదం వస్తుంది. ఇదీ కుందుర్తి గారి సూత్రీకరణ

కవిత్వంలో ఛందస్సు స్థానం యేమిటి? నిజంగా వ్యావహారిక భాషకీ ఛందస్సుకీ సరిపడదా! ఇలాంటి ప్రశ్నలకి సమాధానం తెలుసుకుంటేనేగాని - పై భ్రమలనుంచి తొలగలేము.

కవిత్వం పూర్తిగా *Emotion* కు సంబంధించింది. *Emotion* న్ని మాటలు వ్యక్తం చెయ్యాలి. మాటలు భావోద్రేకాన్ని మోస్తున్నప్పుడు సామాన్యార్థాన్నీ జడత్వాన్నీ వదలిపెట్టి కొత్త శక్తినీ, పుష్టినీ సంతరించుకొని ఉద్రేకం ప్రేరేపిస్తాయి దీనికి ఛందస్సు ఆలంబన అవుతుంది. ఛందస్సు లేంది ఆ *Force* రాదు *Passion* న్ని *Convey* చేయడానికి ఛందస్సు అవసరం. కవిత్వానికి *Rhythom* ఛందస్సువల్లనే వస్తుంది అంతేకాని "అలవాటు" వల్ల ఛందస్సుకు ప్రాధాన్యం ఇవ్వడం లేకపోతే ఇవ్వకపోవడం జరగవు. ఈ అలవాటువల్ల వున్న ఛందోబందోబస్తులేన్నె త్రెంచివేయమన్నాడే కాని శ్రీశ్రీ ఛందస్సును తెంచివేయమనలేదు *Intrinsic passion* వున్నప్పుడు ఉప్పెనలాగ 'అడవులు కొండలు ఎడారులు' అడ్డంలేని విధంగా కవిత్వం వస్తుంది అప్పుడు యతిప్రాస నియమాలు గణరూపాలు ఆటంకం కాకూడదు. అదే శ్రీశ్రీ అభిప్రాయం. ప్రౌఢకవికి "ఛందస్సు ఎలావడితే అలా ఒదుగుతుంది." ఇక పోతే వృత్తాలా - మాత్రాబద్ధ ఛందస్సా అనేవి వేరే చర్చించాల్సినవి. ఛందస్సు మౌలికంగా కవిత్వాన్ని దీప్తించడానికే. నాటికీ నేటికీ ఎన్నటికీ ఇది సత్యం

వ్యావహారిక భాషకీ. ఛందస్సుకీ సరిపోదనడం వ్యావహారిక భాషకే

న్యూనత. మాట్లాడుకొనే భాషలో కవిత్వం వ్రాయడానికి వీలుపడదంటే ఆభాష
లోనే లోపం వుండాలి. మహాప్రస్థానంలోవున్న గ్రాంధికరూపాలుకొన్ని చూపిం
చారు కుందుర్తి. వారు చూపించినవి చూపించనివి వున్నాయ్. అదినిజమే. దానికి
శ్రీశ్రీ 'మాత్రాఛందస్సునే అంటిపెట్టుకొని వుండటం' అనేదిసమంజసంకాదు.
మహాప్రస్థాన రచనా కాలాన్కి శ్రీశ్రీ ఇంకా గ్రాంథిక వాసనలనుండిబయట
పడలేదు. అమాట కొస్తే శ్రీశ్రీ భాషా కాఠిన్యాన్నుంచికూడా బయటపడలేదు.
"సులబంగారాయడమంత కష్టంలేదు. కష్టంగారాయడమంత సులబంలేదు" అని
తానే అన్నాడు. ఆలాంటికష్టతరమైన సౌలభ్యాన్నిసాధించడానికి శ్రీశ్రీకి
ఇన్నేళ్ళుపట్టింది. ఈనాడు శ్రీశ్రీభాషలో కాఠిన్యాన్ని ఎవరన్నాచూపించగలరా?
అలాగే ఈనాడు శ్రీశ్రీ రచనల్లో గ్రాంధిక వాసనల్నీ చూపించలేదు. సహ
జంగా ఛందస్సుకు మలచేటప్పుడు గ్రాంధికభాష తొంగిచూడటం వుండొచ్చు వచ
నగేయానికి ఈ ఇబ్బందివుండదు. కానీ వ్యావహారిక భాషలో కవిత్వాన్ని హిమాల
యోత్తుంగశిఖరాల్ని చుంబింపజేసే గట్టి ప్రథమప్రయత్నంకాబట్టి శ్రీశ్రీలోకొన్ని
చోట్ల సాలిత్యాలుండవచ్చు. దీనివల్లనే ఛందస్సుకీ వ్యావహారిక భాషకీ సరిపోదనడం
అశాస్త్రీయం శ్రీశ్రీ మానసికంగా, కవిగా, పరిణతిచెందిన తర్వాతిరచనల్లోపై
సూత్రీకరణ మచ్చుకికూడా చెల్లదు. ఉదా:- రెండుమూడేళ్ల క్రితంవ్రాసిన "ము
న్నడి" చదివితే తెలుస్తుంది, అంతపకడ్బందీగా ఒక్క గ్రాంధిక ప్రయోగంలేకుండా
వ్యావహారిక భాషలో వ్రాసినగేయానికి ఛందస్సుఏమిఆటంకమైంది? పోనీ 'ఖడ్గసృష్టి'
లోవున్న గేయాలలో (సదసత్సంశయంలాంటి ఒకటి రెండు మినహాయిస్తే) ఛంద
స్సుకీ వ్యావహారిక భాషకీపొత్తు కుదరలేదా? కవి చైతన్యవంతుడై పురోగామి
అయ్యేకొద్దీ ఛందస్సులో వ్యావహారిక భాష వాడగలడు. రెంటికీ ఏ వైరుధ్యం వుం
డదు, ఒక వచనగేయమే వ్యావహారికాన్నికి సరిపోతుందనడం అశాస్త్రీయమైనఊహ.
(అన్యధా భావించకపోతే ఒకమాట - శ్రీశ్రీ కవిత్వంలోని గ్రాంధిక వాసనల్ని
ఎత్తిచూపిస్తూ కుందుర్తి రచనలోనే ఆ ప్రమాదంలోపడ్డారు. శ్రీశ్రీది భారత
మార్గంఅన్న ఉపశీర్షిక క్రిందరాచెస్తూ చెప్పుటలోను హృదయస్పర్శగా పలుకుట
లోను అయనకాయనయే సాటి" అన్నారు).

ఛందస్సంటే వున్న అభిప్రాయాలతోనే శ్రీశ్రీమీద మరొక పెద్దనింద
శారు కుదర్తి. "కాని విచిత్రమేమంటే చెప్పదలచుకున్నదివుంటే అర్థస్పష్టత
వుంటేకూడా శ్రీశ్రీ ఛందస్సులచీరలవెనకా అలంకారాలరవికలమధ్య దాక్క

న్నాడు"అన్నారు. చలాన్ని ఉల్లేఖించారు. ఛందస్సు చీరలు చలంవేకాని అలంకారాల రవికలుమాత్రం కుందుర్తివి. సులభంగా సూటిగాచెప్పేసి ''ఇంత ధ్యానానికీ, మౌనానికి, కార్యాలకీ, విజయాలకీ వ్యవధి'' నిచ్చే పని "ఎంకి శ్రీశ్రీతప్ప" మరెవరూచెయ్యరని చలం అనుకుంటే శ్రీశ్రీకూడా ఆ పనిచెయ్యలేదని (ఎంకి మాట తెలియజెయ్యలేదు) కుందుర్తి అనుకుంటున్నారు. ఛందస్సులో అలంకారాలూ కవిత్వాన్ని ఉద్దీపన జేస్తాయి —నిజమైనకవిత్వలక్షణం సరుకులో వుంటే లేనప్పుడు ఆ ఛందస్సూ అలంకారాలు వికారాలుగా మిగిలిపోయి కవిత్వపులేమిని కప్పడానికి విఫలప్రయత్నం చేస్తాయి అందుకనే ప్రబంధకవిత్వమంతా *Form*కి *meticulous*గా కుదించుకపోయి వుంటుంది '"సహజ సౌందర్యం తక్కువైనప్పుడు'' అని చలమే అన్నాడు. అంతేకాని ఛందస్సునీ కవితాలక్షణాల్నీ ఎక్కడా విమర్శించలేదు. అలంకారాలంటే విద్యార్థి భయపడినట్లు భయపడ్డారు కుందుర్తి. 'మహాప్రస్థానం'' నూటికి తొంభై పాళ్ళు మాత్రాఛందోకావ్యమనీ వేరేభావించనక్కర్లేదు. నిజమంతే! "కవితా! కవితా" అనేది కవిత్వంకాదు. అవిచ్ఛిన్నంగా లయబద్ధమై సాగిపోయే "*Verse libre*". అది గణబద్ధకవిత్వమని కుందుర్తిచేసిన విభజన సరిగా లేదు

కథా కావ్య ప్రియులైన కుందుర్తి వారే ఎటొచ్చీ ఆధునికత్వాన్ని సంతరించుకోలేదని చెప్పాలి. కథా-కావ్యము చారిత్రకంగా ఏనాడో విడిపోయాయి ఆ రెంటినీ కలపటం కాలాన్ని వెనక్కి తిప్పటం ఏమైనా అలాంటివారు కాబట్టి ఆయనకీ 'భిక్షువర్షీయసీ'- 'ఆకాశ దీపం' 'బాటసారి' మకుటాయమానంగా కనిపించడంలో విడ్డూరం ఏమీ లేదుగాని ఆధునికత్వం కాదు. నిజంగా చూస్తే అవి మూడూ అంత కథా మాతృకలుకూడా కావు

ఈ "మహాప్రస్థాన మీమాంస" చాలా అసమగ్రంగా జరిగింది ఉపశీర్షికలు వార్తాపత్రికల్లో వున్నట్టున్నాయి- కవిత్వాన్ని *Analyse* చేస్తున్నట్టు కాదు. ఏమైనా అది చర్చా సదస్సులోది కాబట్టి నా అభిప్రాయాలుమనవిచేశాను.



సమీక్షలు.

# వచన కవిత

—అద్దేపల్లి రామమోహనరావు.

ముప్ఫై ఏళ్ళుగా దినదినాభివృద్ధిపొందుతూ, ఈనాటికి సుస్థిరంగా వ్రేళ్ళు తన్ని నిలబడిన వచనకవితయొక్క స్వరూప స్వభావాల్ని అనేక కోణాల్లో సమీక్షించడానికి ఈ పుస్తకం ఫ్రీవర్స్ ఫ్రంట్ తరఫున, కుందుర్తి, గోపాల చక్రవర్తి గార్ల చేత సంకలితమై, స్నేహాంజలిచేత ప్రచురితమైంది. "వివిధ కవుల కథలు, దృక్పథాలూ" అని అట్టమీద వ్రాయబడి వుంది. ఈ వ్యాసం సంకలనం ఆయా కవుల దృక్పథాల్ని చెప్తుందిగాని, వారివారి పథాలను విశదీకరించదు. కవుల పథాలు-అనగానే వారి కవిత్వపు తీరులు మాత్రం ఈ వ్యాసాల్లో కనిపించవు. అదిగాక యిందులోని వ్యాసకర్తలలో ఇద్దరుముగ్గురు వచనగేయ కవులుగా ప్రసిద్ధులు కాని వారున్నారు.

ఇందులో కె. వి రమణారెడ్డి-వచనకవితయొక్క అవరోధాలు, అవకాశాలు-అనేవ్యాసాన్ని వ్రాశాడు. వ్రాయడంలో ఒక ఆకర్షణీయమైన పద్ధతి నవలంభించాడు (శ్రీ) (శ్రీ) పూర్వం అనేక పత్రికలలో వ్రాసిన వ్యాసాల్లోని ప్రాణమూలకమైన వాక్యాల్ని ఉదహరిస్తూ, వాటిని వ్యాఖ్యానిస్తూ పోయాడు. ఆ (శ్రీ)(శ్రీ)యొక్క వాక్యాలు చాలా సూటిగా, నిశితమైన శైలిలో ఆధునిక కవిత్వాన్ని గూర్చి చెప్పబడినవి. రమణారెడ్డి మొదట ఛందస్సుయొక్క అనావశ్యకతని నిరూపించి. తర్వాత అభ్యుదయ. వచన కవిత్వాలకి అవినాభావ సంబంధమేమీలేదని ప్రస్తావించాడు. ఆ తర్వాత వచనకవిత-ఒక ఉద్యమమౌనా కాదా అనే దాన్ని సుదీర్ఘంగా చర్చించాడు ఉద్యమమనగానే, దాని వెనక కొన్ని తీవ్ర భావాల ప్రచారం అవసరమౌతుంది కొన్ని భావాల్ని కుందుర్తి నియమపూర్వకంగా ఇతః పూర్వం ఉద్బోధించాడట వాటిని చెప్పా. వాటితో తనకేమీ పేచీ లేదుగాని. నియమాలు వదిలేసిన యీ కవిత్వానికి మళ్ళీ ఏదో నియమాలు పెట్ట

డం న్యాయం కాదంటాడు. ఇది రమణారెడ్డి యొక్క విశాల దృక్పథానికి చిహ్నం. ఐతే, వ్యక్తిగతానుభూతి చిత్రణంతో ప్రమాదం లేదుగాని అది సాంఘిక దృక్పథాన్ని మించేటంతగా నోరు విప్పరాదని ఆయన నిర్ణయం తర్వాత వచనానికి, వచనగేయానికి ఉండే తేడాని, విలువులలోని విశిష్టతలను గూర్చి చెప్తూ 'వ్యక్తిత్వమనేది శిథిలావస్థలో ఉండి సాహిత్యాన్ని కళనూ గ్రహిస్తూన్న స మకాలిక పాశ్చాత్య లోకం ఆదర్శమైతే, మనోవ్యాధికి మకుటం తొడగడమే ఔతుంది' అని వైయక్తిక సృష్టి ప్రాధాన్యాన్ని నిరసిస్తూ వ్యాసం ముగించాడు. ఐతే, ఈ వ్యాసకర్త అనేక విషయాలను గూర్చి నాలుగేసి పంక్తులు వ్రాస్తూ పోవడం కంటె ఏదో ఒక్క విషయం తీసుకుని—(ఉదాహరణకి ఛందస్సు, విరుపులు, సాంఘిక-వైయ్యక్తిక వాదం మొ)- దాన్ని గూర్చి లోతుగా వ్రాస్తే బాగుండేది. రమణారెడ్డి వ్యాసశైలి చమత్కార సమేతంగా ఉంటుంది. - 'వచన కవితా, నే తి బీర కాయా?' అంటున్న 'గోలకొండ'లు 'గోలకొండలే'—చెప్పేవిషయంమీద పట్టుదల, ప్రత్యర్థి విషయాలమీద వ్యంగ్యోక్తులూ ఆయన శైలికి జీవం "మార్మికవాదులు మొదలు దిగంబర కవుల వఱకూ బహురూపిగా ఉన్న వచన కవితనంతటినీ కట్ట గట్టి, గానుగలో తొక్కి రసం పిండడమంటూ జరగని పని ఆ పానీయమనేది ఎలాగోలాగు లభిస్తుందే అనుకున్నా. రుచిచూచేప్పుడైనా అది కలగాపులగపు కాక్ టెయిల్ లాంటిదని అనుభవానికి రాక తప్పదు.'

సోమసుందర్ – 'ముక్తచ్ఛంద కవిత. కొన్నిమౌలిక సమస్యలు' అనే విషయంమీద వ్యాసం వ్రాశాడు. ఇందులో మొదట స్థూలంగా ముక్తచ్ఛంద కవితా చరిత్రను స్పృశించాడు. ఇట్లా చారిత్రక విమర్శ మరెవ్వరూ చెయ్యలేదు. నిజానికి ఒక ప్రత్యేక వ్యాసం దీనిమీద విపులంగా వ్రాయబడి ఉండవలసిందీసంకలనంలో. తర్వాత సోమసుందర్ అతిస్థూలంగానే అనేక విషయాల గూర్చి ప్రస్తావిస్తూ పోయాడు కవితయొక్క నిరంతరానే పణశీలత్వమూ. ప్రయోగప్రయోజనమూ, నేటి కవులబాధ్యతా, చోదకశక్తియైన కాలమూ- వీటిని వరసగా స్పృశించాడు తర్వాత వచన కవిత శతాబ్దాలుగా సాధించుకోలేని ఆవేగాన్ని అంతర్ముఖత్వాన్నీ సాధించుకోగలిగిందని చెప్పి, యిందులో ఉక్తివైచిత్రిని సోదాహరణంగా పరిశీలిస్తూ వ్యాసం వాసినా అదిసమగ్రంగా ఉండేది తర్వాత తెలంగాణా. సినీవాలీ, మేఘరంజనీ- అనే సమగ్ర కావ్యాలు వచ్చినై అన్నాడు. వ్యావహారిక భాషవహించిన ప్రాధాన్యాన్ని వివరించాడు; వచన కవితా శక్తి సంపదను గూర్చి

ఉదహరించాడు ఈయన వ్యాసంలోని గొప్పఅసంతృప్తి ఏమిటంటే. 20 పంక్తులు రాసేటప్పటికి మరొక నూత్న విషయాన్ని స్పృశిస్తూ, పరమ సూలంగా దాన్ని గూర్చిచెప్తూ, ఏ ఒక్కదాన్ని గూర్చి సమగ్రంగాచెప్పకపోవడం పైగావ్యాసంలో చాలా విషయాలు కవులకి సలహా ప్రాయంగా ఉన్నై. చారిత్రక పరిశీలనగాని, ఉక్తివైచిత్రి, వచన కవితా శక్తి- మొదలైన వాటిని గూర్చిగాని సూక్ష్మ విషయాలు వ్రాయగలవారు ఇట్లాంటి వ్యాసం వ్రాయటం (ఇది వ్యాసం అనబడదు) పాఠకులకి అసంతృప్తి కరం

వరవరరావు-స్వచ్ఛంద కవిత్వంలో వస్తువు-గూర్చి వ్రాశాడు వస్తువు- అనగానే దానివెనక అనంతమైన అగాధమైన బహుచర్చనీయమైన అంశాలున్నై. కొంత మందికి అభౌతిక వస్తువేకావాలి కొంతమందికి భౌతికానంద మే కావాలి. ఇంకొందరికి అరాచకం కావాలి. ఇట్లా పరమవిభిన్న వస్తు చర్చాసమన్వితమైన నేటిసాహిత్య రంగంలో- వస్తువు గూర్చి బాధలేని వారూ ఉన్నారు. కవిప్రతిభ యేశాశ్వతమైంది. వస్తువేదైనా శిల్పసహితమై పఠితకానందం కల్గించ గలదని వారి విశ్వాసం. నిజానికి, కేవల కవితానంద లీన మనస్తత్వ కలవానికి, శిల్పమే ప్రధానంగాని, వర్ణనీయ వస్తువుకాదు. ఒక ప్రత్యేక సాంఘిక సమస్య మీదనో, మరొక విశిష్ట సౌందర్యానుభూతిమీదనో, తమ జీవితాన్ని కేంద్రీకరించిన వారికి తమభావానికెదురైన భావాలు సహించ శక్తి ఉండదు అందుకని వారు తమ భావాలకు వ్యతిరేకమైన కవిత్వంలో లీనం కాలేరు ఈ విధంగా రెండుపాయ లయిన సాహితీ రసికతను నియమించడ. సాధ్యమా? నియమిస్తామంటారు తీవ్ర వాదులు. అట్లా నియమించబూనడం సామ్యవాద విరుద్ధం గనుక ఎవరికి నచ్చిన భావంలో వారు రమించనిమ్మ టారు సమభావనా జీవులు ఈ రెండో విధమైం వారు వరవరరావు. ఆయనకు ప్రస్తుత భయంకర సమస్యా పీడిత సమాజం మీద గల సానుభూతి వలన-సమాజాన్ని మేల్కొలిపే బాధ్యత కవిత్వానికున్నదని గాఢ విశ్వాసం ఉన్నా. మిగిలిన వస్తువులని నరసించి నిందించే లక్షణంలేదు 'ఖండికలు రాసినా అన్నింటా ఒక తెగిపోని, ఒక అంతస్సూత్రంగా ప్రవహించే మానవతా ముద్ర విశ్వజనీనత. సౌందర్యదృష్టి, సత్యాన్వేషణ. లోతయిన పరిశీలన కావాలి' అంటాడు. కవిత, కవిత్వంలో ఉద్యమశీలత్వం ఆయనకి ఇష్టం తన వ్యాసంలో రెండో ప్రపంచ యుద్ధం, కమ్యూనిష్టు ఉద్యమం, తెలంగాణా ఉద్యమం- వీటిని చారిత్రకంగా సమీక్షించి, తర్వాత నేటి కవితలో వ్యక్తివాద ప్రాబల్యం గూర్చి,

నగర జీవిత చిత్రణను గూర్చి పరామర్శించి, ఒక వ్యవస్థగా రూపొందని దిగంబర కవిత్వాన్ని ఉటంకించి కథాకావ్య విషయాన్ని తర్కించి, ఒక నిర్దిష్ట మైన ఉదాత్త వస్తువుకోసమే నేటి కవిత్వం అన్వేషిస్తోందని ముగిస్తాడు ఈయన శైలిలో ఒక ఉద్రేకం ఉన్నది- కవితాత్మకమైన పంక్తులు దొర్లుతాయి. 'కవిత్వం సంక్లిష్ట మైన జీవిత కావ్యంలో ఒక సెమికోలన్'- కవిత్వంలో వస్తు వైవిధ్యాన్ని, ఈ నాటి కొందరు వ్యాసకర్తల వలె, పట్టికలాగా తయారుచెయ్యకుండా, తన వ్యక్తిత్వపు స్పర్శచేత, శైలిచేత, ఆకర్షణీయంగా చేశాడు రచయిత. ఏమైనా ఈ వ్యాసంగూడా, విభిన్నవిషయాలను వరసగా చెప్పుకుపోయినట్లు తోస్తుందిగాని నిష్కర్షగా ఒకకోణాన్ని తీసుకుని, సమగ్ర చర్చచేసిన ఒక అంతః ప్రవాహంగా స్ఫురించదు-

సంపత్కుమార- వచనపద్యంలోని ఛందోరీతిని గూర్చివ్యాసం వ్రాశాడు ఈ వ్యాసం ఉన్నవాటిల్లో సమగ్ర లక్షణాలుగల వాటిల్లో ఒకటి ఇందులో మొదట ఛందస్సుయొక్క క్రమ పరిణామాన్ని గూర్చి చెప్పాడు. ఛందస్సు మారాలి- అనేభావం ప్రాచీన కాలం నుండిగూడా ఉన్నదనే విషయాన్ని నిరూపిస్తూ, ఒక తరం క్రిందటి భావ కవుల ఛందో భిన్నతల్ని ప్రస్తావించి, తర్వాత ద్విపదలో తొలిసారి కావ్యం నిబంధించిన పాల్కురికి సోమనాధుడి విప్లవాన్ని వివరించాడు. తర్వాత సింహగిరి, తాళ్ళపాక వచనాలను గూర్చి చెప్పాడు. నూతన చ్ఛందస్సులకై అన్వేషణే రానురాను వచన కవితగా పరిణమించిందని పేర్కొన్నాడు కాని ఆధునిక కాలపు వచన కవితలోని లక్షణాన్ని వివరించడానికి సోమనాథుని, తాళ్ళపాకనీ చెప్పవలసిన అవసరమున్నదా? ఛందస్సులో వాళ్ళుచేసిన మార్పువల్ల వాళ్ళుపొందిన ప్రయోజనాలకూ, ఆధునిక వచనకవితా ప్రయోజనాలకూ సంబంధం ఉన్నదా?-నాకు లేదని తోస్తోంది ఆధునిక వచన కవితలో ఛందస్సుయొక్క మార్పు, సకల భావాభివ్యక్తీకరణయొక్క సమూలమైన మార్పు, సర్వముఖాల్లో స్వతంత్రతన పేక్షించిన ఒకయుగపు కవితా జీవితముయొక్క తిరుగుబాటు సోమనాధుడు ద్విపదలో రాయిడం, భావనాభివ్యక్తిలోని వైలక్షణ్యం కొఅకుగాదు-ఉద్రేకాన్ని సమగ్ర దశల్లో వెలువరించే అవకాశం గల గీత లక్షణాన్ని పురస్కరించుకొని శైవ మరుక్తి వ్యాప్తి చెయ్యడానికి అట్లాగే వచనాలు గూడా విలువుతని ఒక వైలక్షణ్యం వలన భక్తి భావనాభివ్యక్తికి సముచిత వాహికగా ఉండడమే ఆ కవులు వాటిన పరి

గ్రహించడానికి కారణం. ఇది ఎట్లాంటి దంటే, కొన్ని కథలు గేయంలో బాగుంటాయని వాటిని గేయాల్లో చెప్పినట్లు (ఉదా. కిన్నెరసాని), కొన్ని పాటలలో బాగుంటాయన్ని పాడినట్లు (ఉదా: ఎంకిపాటలు) ఈ సాహిత్యప్రక్రియలన్నీ కొన్ని కొన్ని ఒక్కొక్క విధమైన భావనా విధానానికి నప్పినట్లు భావించబడినై. కాని వచన గీతికలో జరిగింది మూలచ్ఛేదన. సర్వభావాలు, కథలు, నాటకాలు- అన్నీ చెప్పడానికి ప్రయత్నం. నియమ బద్ధమైన నడక - అనేదాని యొక్క సంపూర్ణమైన మార్పు. తర్వాత సంపత్కుమార- నేటి వచనగేయాల్లోని పాదాల విభజనలోని తత్త్వాన్ని గూర్చి, భావాభివ్యంజనలోని విలక్షణతని కూర్చి, పాదంలోని ఊపు, విసరు- ఎట్లా ప్రాణభూతమైన లక్షణాలౌతున్నయ్యో దాన్ని గూర్చి చాలా సోదాహరణంగా, విశ్లేషలో ప్రధానంగా చెప్పారు. ఇది చాలా అవసరమైన కృషి. తర్వాత కథాకావ్యాల్ని అంగీకరించారు. చాలామంది వ్యాసకర్తల వలెనే. (ఒక్క తిలక్ మాత్రమే కథాకావ్య వ్యతిరేకిగా కనిపిస్తున్నాడు.'కథనానికి కవితా ప్రక్రియను వినియోగించడం శుద్ధ అనవసరమని నా భావం'- అని ఒక చోట పలికిన సోమసుందర్ -'ఉత్తమ కవితా లక్షణాలతో కథన కావ్యాలు వెలువడితే స్వాగతం పలకడానికి విమర్శకులు విశుద్ధ హృదయాలలో సంసిద్ధులై ఉండటం ఉభయ తారకం'- అంటాడు.) సంపత్కుమార, వచన పద్యంలోని పాదాల విరుపులలోని భావాభివ్యక్తి రహస్య వివరణకై చేసిన ప్రయత్నంచాలా విశిష్టమైనది. మొత్తంమీద సమగ్ర వ్యాసలక్షణం కలిగిన రెండు మూడు వ్యాసాల్లో యిదొకటి. ఏదో ఒకఅంశాన్ని ప్రధానంగా గ్రహించి, సూక్ష్మవిభజన పూర్వకంగా, దాని అభివృద్ధిని నిరూపించడం సమగ్రవ్యాస లక్షణం. ఇట్లాంటి వ్యాసాలీనాడు కావాలి ఎక్కువసంఖ్యలో రావాలి

వచన గీతం నిలత్రొక్కుకోడానికి కథ అవశ్యకమన్న కుందుర్తి, అంటే- కేవలం అనుభూతిప్రాధాన్యమే వచనగీతం యొక్క అయువుపట్టనితిలక్ అంటాడు ఇవిరెండు మార్గాలు. బహుశః ఆయాకవుల కవితాత్మల పరిణతినుండి పర్యవసించిన రెండు అభిప్రాయాలు. మొదటిది శిల్పమార్గం రెండవది అనుభూతిమార్గం. ఈ రెంటిలో ఏది ఉత్కృష్టమైనది? శిల్పప్రధానమైన రచనగాని అనుభవించే మానవుల హృదయాలు ప్రమాణాలుగా నిలిచి ఉంటుంది. శిల్పప్రధానమైన నన్నయ భారతం శిల్పజిజ్ఞాస చావని మానవులున్నంతదాకా నిలిచి ఉంటుంది. అనుభూతి

ప్రవాహామైన కీట్సు 'నైటింగేల్ గొంతలో కానికి వినిపించినంత కాలం బ్రతికి ఉంటుంది. కాబట్టి నిలకడకోసమే కథకావాలి అని అనుకోనక్కరలేదు. కాని ఏ కవితా మార్గమైనా దాని శక్తి యొక్క అవధులదాకా పరిణతి పొందవలసిన అవసరమున్నది. కవిత్వమన్నది అనుభూతి ప్రధానమైనది. అనుభూతికి సంపూర్ణత కలగ జేసే ఏమార్గాన్నైనా సరే అనంతంగా అన్వేషిస్తూ పోవడం అచ్చమైన భావుకుని లక్షణం. ఈ దృష్టిలో వచన గేయం కథా సమన్వితమైతే అది కల్గించగల ఆనందం విలక్షణమైనది. అనుభూతికి తోడు సమగ్రమైన శిల్పం గూడా జోడింపబడితె వచనగేయానికి ఒక ముఖంగా సంపూర్ణత సిద్ధించినట్లౌతుంది. కుందుర్తి, తిలక్, 'నవత'లో ప్రారంభించిన దృక్పథాలు చాలామంది విమర్శకుల దృష్టినాకర్షించినై. అందుకే యీ సంపుటిలోని రచయితల్లో చాలా మంది ఈ దృక్పథాల్ని గూర్చి ప్రస్తావించారు రమణారెడ్డి అనుభూతి వైయ్యక్తికంగా, కథ సాంఘికంగా నిరూపించి. కేవలానుభూతిలీనత సంఘం నుండి మనిషిని దూరం చేసే ప్రమాదమున్నదని వివరించి, సమభావనగలవారైనా, కేవలాను భూతివాదాన్ని ఒప్పుకోలేదు. సోమసుందర్ 'ఈ రెండు వాదాలూ అసలు సత్యానికి రెండు చివరి కొసలనీ, సత్యం ఈ రెండిటినడుమ నున్నదేననీ' చెప్తాడు. వరవరరావు బృహత్కావ్యం రాయనివ్వని వాస్తవిక వర్తమాన సాంఘిక పరిస్థితుల్ని వివరిస్తాడు. కేవల సాంఘిక పరిస్థితులు బృహత్కావ్య రచనకి మేనిధాలా? అన్న అనుమానం గూడా నాకున్నది. ఎందుకంటే, ఈనాడు రోజుకి ఎన్ని నవలలు ఎన్నికథలు ఎంత దీర్ఘంగా వ్రాయబడుతున్నై! ఎంత విరివిగా చదవబడుతున్నై! కథా నవలా విషయకంగా నేటి యుగం నిరాశ పొందవలసిన అవసరం లేదు. మఱి ఏమిటి ఈ యుగంలో అవరోధం అంటే అది కవితా రసాస్వాదనా విదూరస్థితి. ఈ రోజుల్లో కవిత్వం సహృదయుల్ని వెతుక్కోవలసి వస్తుంది ఒక సంఘంలోని సాహిత్యాభిరుచియొక్క అవధిభూతమైన స్థితి కవిత్వ పఠన మీద ఆధారపడి ఉండగా, నేటి మన దేశంలోని, ముఖ్యంగా ఆంధ్రదేశంలోని దుస్థితి, పరమ విచార కరమైనది ఈ దౌర్భాగ్యస్థితి తొలిగేదెప్పుడంటే, ప్రతి వ్యక్తి విద్యావిషయకంగా సాహిత్యాభిరుచి విషయకంగా బాగా పురోగమించినప్పుడు బృహత్కావ్యాలు గాని, లోతైన రచనలుగాని, ప్రయోగాలుగాని ఆనాడు నిలవవు. ఈ లోపల గౌరవమంతా తాత్కాలిక బహిః ప్రయోజన కరమైన రచనలకే అని అనిపిస్తుంది.

సుప్రసన్న—కథాకావ్యం గురించే ప్రత్యేకంగా ఒక వ్యాసాన్ని వ్రాశాడు. ఈయన దృక్పథం గూడా ఎక్కువగా కథాకావ్యంవైపే ఆకృష్టమైనదిగా కనిపిస్తుంది. కథాకావ్యం వస్తేగాని వచనకవి తన సంపూర్ణశక్తి ప్రదర్శింపలేడనే యీాయనయొక్క నిర్ణయంగూడా, వచన కవిత్వంలోకథచెప్పడంలోని వైశిష్ట్యాన్ని సుప్రసన్న చాలాలోతుగా పరిశీలించాడు. 'కథ చిత్రణలో నవల ఎన్ని ఒదుగులయినా పోతుంది. కావ్యంలో ఉన్న సౌందర్యాన్ని సంతరించుకోగలదా—అని సందేహం'—ఇది ఎవరూ స్పృశించని ఒక ప్రధానమైన విషయం. ఎందుకంటే ఒక నవలగా వ్రాయ బడుతూనే ఉండగా వచన పద్యంలో వ్రాయబడవలసిన అవసరమేమన్నది ప్రశ్న. నవల కథా చమత్కార ప్రధానం కాగా వచనపద్యకథాకావ్యంలో అనుభూతిప్రాధాన్యం వహిస్తూ ఉన్నది. కథమొత్తంమీద కవి చెప్పే సందేశమేమిటంటే. కథలో అంతః ప్రవాహమైన అనుభూతి. రాచకొండ రాసిన 'మెఱుపు మెఱిసింది వగైరా కథల్లో ఉన్నది యిదే. శ్రీశ్రీ భిక్షువర్షీయసి మొదలయిన కథాకావ్యాల్లోగూడా కథాచమత్కారం కంటే, అనుభూతి ప్రాధాన్యమేఉన్నది. కథని అనుభూతి ప్రధానంగా వచనగీతికలలో మలచడానికి జరిగిన ప్రయత్నాల్లో శిలా వీర్రాజు వ్రాసిన 'కొడిగట్టిన సూర్యుడు' ప్రముఖమైనది. అంతకు ముందు అక్కడక్కడ అట్లాంటి ప్రయత్నాలు జరిగినా. ఈ కావ్యమే సమగ్ర ప్రయత్నానికీ. దాన్ని ఒకవిధానానికీ మలచడానికీ మొదటిది. సుప్రసన్న అరవిందఘోష్ యొక్క 'సావిత్రి'ని ఉదహరించడం కూడ చాలా సముచితమైనది. ఎందుకంటే సావిత్రి కావ్యమంతా తీవ్రానుభూతి వ్యంజకంగా రచించబడినన కావ్యం. వచన కథాకావ్యంలో ప్రధానంగా స్వీకరించబడవలసిన అనుభూతి విస్తరణకు మార్గదర్శిత్వం సావిత్రిలో లక్ష్యమౌతుంది. పైగా వచన కవిత్వంలో చాలాముఖ్యమైన రూపకం (*Metaphor*) సావిత్రిలో బహుముఖాల ఉపయోగించ బడింది సుప్రసన్న వ్యాసంకూడా చాలా అసమగ్రమేఅనాలి. లోతైన విషయాన్ని తీసుకుని. విస్తరించకుండా వ్రాశాడు ఆయన తీసుకున్న విషయాల్ని యింకా సూక్ష్మవిశ్లేషణ పూర్వకంగా వ్రాసి ఉండవలసింది. అందుకాయన సమర్థుడు కూడా.

ఈ వ్యాసాల్లో చాలా మంది 'దిగంబర కవిత్వాన్ని స్పృశించారు. కుందుర్తి—ప్రత్యేకంగా వీరికోసమే 'ఆధునిక కవిత్వంలో ఇటీవలి పోకడలు' అనే

పేర ఒక వ్యాసం వ్రాశాడు. మొదట వచన గీతికలోగూడా దాని నిలకడశక్తి కొన్నికొన్ని నియమాలను సూచించి, ఇటీవలి కవితలో కొంతెకోణాలపై తనకి సదభిప్రాయం లేదని ప్రస్తావించి, వాటికి కారణం రచయితల దౌర్బల్యంగా వివరించాడు, ఆ తర్వాత 'డడాయిజమ్' గూర్చి పాశ్చాత్యదేశంలో, ముఖ్యంగా ఫ్రాన్సు, జర్మనీలలో దాని విజృంభణగూర్చి చాలా విపులంగా వ్రాశాడు. ఈ పంక్తులు అవహేళన ప్రధానమై ఉండి, చదవడానికి చాలా ఉత్సాహకరంగా ఉన్నై. ఆ పిదప ఇక మన దిగంబరకవుల అరాజక తత్త్వాన్ని గూర్చి చాలా తీవ్ర నిందా పూర్వకమైన విమర్శ చేశాడు. 'ప్రయోగం కోసమే జరగరాదని అది ప్రతిభ మూడుపూవులారుకాయలైనప్పుడు సహజ వికాసం పొందాలనీ చెప్తూ దిగంబరులు చేసినవన్నీ క్రొత్తగా ఉండాలని చేసినవేతప్ప ప్రయోజనంలేని ప్రయోగాలని చెప్పాడు చివరకీ ఆకవిత్వం వ్రాసినవారూ, చదివినవారూ-అంతా పిచ్చాసుపత్రికే పోతారని సూచించారు.

ఐతే- ఇంతటి నిందకి దిగంబర కవులు అర్హులా? వారిలో వెఱ్ఱితలలే కాక మరేమీ లేదా? కుందుర్తి చెప్పినట్లు వారు ప్రయోజనరహితంగా చేసిన ప్రయోగాలన్నీ నిందార్హమయినవే అక్కడక్కడ వారు చూపిన 'మర్మాంగాలు'- కవితాస్వాదనకి అవరోధాలు కావడంలో ఏమీ అబద్ధం లేదు. కాని, వచనకవిత యొక్క ఆధునిక కాల విజృంభణ ప్రస్థానంలో 'దిగంబర శకం' ఒక విశిష్టమైన మజిలీ ప్రస్తుత సాంఘిక దౌర్జన్యాలను గూర్చి యింత తీవ్రమైన ఉద్వేగం గల కావ్యమీనాడు చాల తక్కువ. ఆ తీవ్రమైన ఉద్వేగం, ఉద్వేగంగానే మిగిలితే దానికి కావ్యత్వపు విలువలేదు. కాని, వీరి కవిత్వంనిండా చాలా ఉన్నతమైన కవితా గుణాలునై ఈ కవుల్లో ఒకరిద్దరు ఒకటి రెండుచోట్ల చప్పగా వ్రాసిన. మిగిలిన కవిత్వమంతా, కవిత్వపు జలపాతం కురిసినట్లున్నది. అంతమంది కలిసి- కొన్ని సమాన లక్షణాలు గల కవిత్వాన్ని ఒకే ఉద్రేకదశలో ప్రవహింపజెయ్యడం అని దం పూర్వం- ఆశ్చర్యకరం- అనక తప్పదు.

— యోధాన యోధులు మేధావులు
యోగులు, పైమాపులలో మహామనీషులు
మందిరాలు, దేవుళ్ళు
కవులూ, కవిత్వం కౌలుదార్లు నటులూ నాయకులు

ఒక్కసారి
ఒకేసారి
కాలం వెల యాలుతో రమిస్తున్నారు-

ఈ చివరి పాదంలోని ధ్వనికి విలువ కట్టగలమా? పైన పేర్కొన్న అందరూ జీవితాన్ని ఎంత తేలిగ్గా తీసుకుంటున్నారో, కపటాన్ని పరమావధికి తీసుకు పోతున్నారో, తమ భోగలాలస జీవితంలో సమకాలిక దారిద్ర్యాన్ని పెంచుతు న్నారో, పైపంక్తులు చాలా తీవ్రంగా సూక్ష్మంగా వ్యంగ్యం చేస్తున్నై.

—పరిపాలన పరించి కాల పెనంపైన
పేదల ఆకలి చిందుల్ని
సంప్రదాయ నాట్యంగా సమాజం తిలకిస్తున్నది-

ఈ రూపకంలో పేదల బాధల్ని ఏమీ పట్టనట్లు చూచే సమాజానికి ఎంతో చక్కని రూపకల్పన చెయ్యచూసింది. పునర్యోని ప్రవేశం-లాంటి గేయాలు వారి అంతర్గాధాలోచనా ప్రవాహానికి చిహ్నాలు. షష్ఠిపూర్తి—మొదలైనవి సమా జంమీది తీవ్రవ్యంగ్యానికి పతాకలు అణుయజ్ఞం-లాంటి గేయాలు మహోన్నత మైన ఊహా శక్తికి, కల్పనా వైభవానికి నిదర్శనాలు.

—శతాబ్దాల పరిణామం ప్రగతిపై
అనాదిగా పెరుగుతూన్న అనంత మానివుణ్ణి నేను.
పురోగమనం అద్భుతాల వ్యామోహంలో
విజ్ఞానం విజయాల దాహం పరిధిలో
తిరుగుతూన్న ఇంగితాన్ని నేను—
సృష్టియోనినుండి జారిపడ్డ విచిత్ర వికార రూపాన్ని నేను-
ఇంకా ఎదగని మానవుణ్ణి నేను-

ఇట్లాంటి దివ్యమైన శైలి కావ్యంలో మూడు పాళ్ళుగా ఉన్నది.

'మా' అనే గేయంలో సమిష్టి మానవ హృదయ గత పంకిలాన్ని తన ఒక్కడి హృదయంగా సంకేతించి-

—నా హృదయంలో...
20 శతాబ్దాల దారుణ మానభంగాల్ని

భ్రూణ హత్యల్ని అంతులేని అంధకారాన్ని
ఇక్కడ దాచాను-ఇక్కడపూడ్చాను-

అని చెప్పిన విషాద భావనలోని లోతుచాలా ఉన్నతమైనది. ఎందుకింతగా చెప్తున్నానంటే, కావ్యగుణాలు చాలా ఉదాత్తదశలో ప్రకాశిస్తుండగా వాటిని మనం తప్పించుకు పోలేం. కాని యింత కవితా శక్తి, తమకొన్ని విచిత్ర వికార జుగుప్సాకర ధోరణుల వలన బూడిదపాలౌతుంది-అని గమనించడానికి, కుందుర్తి వ్యాసంచాలా ఉపకరిస్తుందని భావిస్తాను. కాని కుందుర్తి "కవితకు కొన్ని విలువ లున్నయని బహుశా వారు నమ్మరు. అంతే, ఉన్న వాటిని ధ్వంసం చేస్తారు" అన్న మాటలు మాత్రం చాలా సత్యదూరంగా కనిపిస్తున్నై.

వేగుంట మోహనప్రసాద్-వచన కవితలో శైలి దాని తత్త్వమూ గురించి వ్రాశాడు ఆధునికాంగ్ల కవితా విమర్శన పఠనం చేత ఒకచక్కని విశ్లేష ణాత్మకమైన దృష్టి వ్యక్తమయ్యే రచన యిది దాదాపుగా ఈనాడు ఆంగ్ల విమ ర్శనయొక్క పురోగమనం విశ్లేషణ దృష్టిమీద ఆధారపడి ఉన్నది కవిత్వ విమర్శ నలో కఠిష్ఠమైన పదంనుండి- గరిష్ఠ శిల్పందాకా, పరమ సూక్ష్మ పరిశీలనవారిలో కానవస్తుంది ఇది మన విమర్శకులలో చాలామంది నేర్చుకోవలసి ఉన్నది వచన పద్యంలోని లయయొక్క తత్త్వాన్ని గూర్చి సౌందర్యంగూర్చి చర్చించి, గమన ములోని చమత్కారాన్ని గూర్చి, భావంలో శైలి కలిగించే జిలుగుల్ని గూర్చి సూక్ష్మనిరూపణ పూర్వకంగా వ్రాశాడు. ఆయన వచన కవితాశైలిని నాలుగు భాగాలుగా విభజించాడు.

1. ఛందోనియమాల్ని కొన్నిపాటించినవి.
2. కాలవేగాన్ని మాత్రమే తీసుకుని పంక్తి పొడవు నిర్దిష్టమైనవి.
3. మామూలు వచనమే మంత్రంలా జపించేవి
4. వ్యావహారిక భాషాస్థాయిలోనిలిచే కవిత.

ఈ విభజనలోని ప్రతి అంశాన్ని గూర్చి, దానితత్త్వాన్నిగూర్చి లోతైన దృష్టితో ఒకవ్యాసం వ్రాయవలసిన అవసరమున్నది. అందుకు మోహనప్రసాదే అర్హుడు.

ఈయన దగ్గర ఏ విషయాన్నయినా కుండబద్దలు కొట్టినట్లుచెప్పే ఒక

లక్షణం ఉన్నది (శ్రీ శ్రీ)మీద ఎంత అభిమానం ఉన్నప్పటికీ భావాన్ని చెడగొట్టే శబ్దప్రక్రియత్వాన్ని సహించలేదు. "పరాయి శబ్దాలమీద మనభాషలో పన్ చేస్తూ సంతృప్తి పడడం మానసిక పతనానికీ భావదారిద్ర్యానికీ గుర్తు

"సిమెంటనే మారుపేరు ధరించిన
ఇసుకతో నిర్మించబడిన
వంతెనలాంటి ప్రభుత్వమా!"

ఈ *Spent force* ల ఉక్రోషజనితమైన ముసలి వ్యంగ్యం ఎవరినీ ఉత్తేజపఱచదు. కొన్ని మంచి ఖండికలని, ఐదారింటిని ఈయన ఉదాహరించాడు ఇవి మంచి ఖండికలేగాని, యింతకంటే చాలా గొప్పకవితాశక్తి గలవీ, అవే రచయితలు వ్రాసినవీ చాలా ఉండగా, వీటినే ఉదాహరించడం ఎందుకో అర్థంకాలేదు. కనీసం, ఈ గేయం యిందువల్ల ఉన్నతమైనదని కొద్దిపాటి వివరణ పూర్వకంగా వ్రాస్తే తృప్తిగా ఉండేది చివరకి "పోలికలు" అనే ఒక పేరుపెట్టి,

—గగనానికీ నా పాంటు గుండీలకీ
నడుమ పొద్దు పొడవదు—(నగ్న ముని—
ఆకేపాదాలకీ)

*I grow old I grow old*
*I wear the trousers of my votfoms Rolled*"

అనే *Eliot* రచనకి పోలిక గలదంటాడు. ఈ అర్థం యొక్క ప్రేరణతో నగ్నముని వ్రాశాడనుకోను నేను అసలు భావంలోనూ పెద్దపోలికలేదు ఇలియట్ది చాలా ధ్వనిగర్భమైన, చమత్కార పూర్వకమైన రచన మఱి నగ్నమునిది భావం సరిగ్గా తెలియబడని, జుగుప్సాన్వితమైన, చదివిన వెంటనే ఫక్కుమని నవ్వించే రచన.

సంకలనం చివర చేర్చబడిన శీపాద గోపాలకృష్ణమూర్తిగారి వ్యాసం-పగానికి పైన అలంకారాల అనావశ్యకతని గూర్చిన అప్రస్తుత ప్రశంస. (అంటే ఆయన వ్యాసం రాసిన ప్రయోజనం వేరు. ఈ సంకలనంలో చేర్చేటప్పుడు ఈ భాగం అనవసరం) తర్వాత ఛందస్సు అనావశ్యకమని చెప్పడంలోగూడా ఎక్కువ భాగం పద్యాలమీద తిరుగుబాటేగాని, వచనగీత తత్త్వాన్ని వివరించదు. ఐతే, ఆయన శైలి చాలా శక్తిమంతమైనది. భారతి-లో ఆవ్యాసాలు పడుతున్నప్పటి సందర్భం

వేరు ఈ సంకలనంలో ఈ వ్యాసం సంపూర్ణ ప్రయోజన కారికాదు. మిగిలిన వ్యాసాల ప్రయోజనంతో సమాన లయ కలిగినది కాదు వ్యాసం మంచిది; కాని యీ సంకలనంలో దానిస్థానం గూర్చి నా విమర్శ.

ఎవరేమి చెప్పారు?-అని ప్రసిద్ధులవ్యాసాలలోని భాగాలుకొన్ని యివ్వడం; వచన కవితా యాత్రలోకొన్ని మజిలీలన్న పేరు- శ్రీశ్రీనుండి ప్రసిద్ధులందరి కావ్యాల్ని, వ్యాసాల్ని పేర్కొనడం- సాహిత్య పిపాసువులకి చాలా మేలు చేసే కృషి ఈ వ్యాసాల్లో క్రొత్త తెన్నులు-అనే దువ్వూరి రామిరెడ్డి- వ్యాసంగూడా ఉన్నది. కాని ఇది వచన కవిత్వాన్ని నిండుగా ఖండించి దూషించే వ్యాసం. మిగిలినవన్నీ సమర్థించేవే వాటి మధ్య యిది అనావశ్యకమని నా భావం: ఖండన గూడా తెలియాలంటే, యిటీవలివి యింకా తెలివైనవీ చాలారచనలున్నై.

చివరకు, ముఖ్యంగా పేర్కొనవలసింది, అట్టమీదిబొమ్మ. శీలా వీర్రాజు చేత ఈ చిత్రం వెయ్యబడింది ఇది ఆధునిక సమాజంలోని అసమత్వాన్ని, గజిబిజినీ వ్యక్తం చేస్తుంది ఒక గడియారాన్ని శిథిలదశలో, అంకెలన్నీ తారుమారై అస్తవ్యస్తన స్థితిలో వేశాడు వీర్రాజు గడియారం కాలానికిసంకేతం. అధునిక కవితను గూర్చిన పుస్తకం మీద అధునిక చిత్రకళలో లిఖించబడిన ఈ బొమ్మ చాలా భావస్ఫోరకంగా ఉంది

ఆనాడు మహా విప్లవమైన భావకవిత-ను గూర్చి యిట్లాంటి సంకలనం వెలువడలేదు. ఆ కొఱత వచన గీతికకి లేకుండా ఒక పుస్తకాన్ని ప్రచురించిన ఫ్రీవర్స్ఫ్రంట్ అభినందించదగినది. ఇట్లాంటి పుస్తకాలు ఇంకా రావాలి వచన కవిత తత్త్వం పూర్తిగా నిరూపించ బడాలి. పెద్దలందరి వచనకవితలమీదా ప్రత్యేక విమర్శ పుస్తకాలు రావాలి అప్పుడుగాని మనవిమర్శనవీధి కలకలలాడేరోజురాదు.

[వచనకవిత: వివిధ కవుల పథాలూ, దృక్పథాలు సంకలనం: కుందుర్తి, గోపాలచక్రవర్తి, ఫ్రీవర్స్ఫ్రంట్ ప్రచురణ.

వెల: రు. 3-00 ప్రాప్తిస్థానము: విశాలాంధ్ర బుక్‌హౌజ్ హైదరాబాదు ]

(మానవుడే మా సందేశం కవితా సంకలనం, చైతన్య సంస్కృతి, జడ్చెర్ల, మహబూబ్‌నగర్ జిల్లా ప్రచురణ; వెల రెండు రూపాయలు)

ఇది మానవ సందేశాన్ని వినిపించ బూనుకున్న కవుల రచనల కూర్పు వీరిలో ఆరుద్ర, సోమసుందర్, కె వి. రమణారెడ్డి, దాశరథి, కాళోజీ, సి. నారాయణరెడ్డి, వరవర రావు మున్నగు కవులున్నారు.

సంకలనాన్ని సాహిత్యంలో అభ్యుదయ పథమైన చైతన్యాన్ని తీసుకు వచ్చిన శ్రీ శ్రీకి అంకితం చేసింది చైతన్య సంస్కృతి

ఇందాదినయుగకర్తైన శ్రీ శ్రీ గురించి కె.వి. రమణారడ్డి వ్యాసమున్నది.

సంకలన కర్త జలజశ్రీ పేర్కొన్నట్లు ఇందులోని కవితలన్నీ అత్మాశ్రయంగా చెప్పినా, ధ్వనిమాత్రంగా చెప్పినా నేటి సామాన్యమానవుని సమస్యల నిజస్వరూపాలకి దగ్గరగా వున్నవి. ప్రస్తుత సాంఘుక రాజకీయ వ్యవస్థలు మారి సర్వరంజకమైనది, సుఖశాంతుల నిలయమైనది, సుందరమైనదీ, మరేదో అందమైన లోకం కావాలనే కోర్కె ఎక్కువరచనల్లో కనిపిస్తుంది

మానవుని సమస్యలని, కోర్కెలని సుస్పష్టంచేస్తూ అందమైన లోకం కావాలని కోరుకుంటూ వాటితోపాటు మానవుని పురోగతికి ఉపయోగపడేలా నిర్దిష్టమైన సందేశమేదైనా ఇచ్చి వుంటే పుస్తకానికి పెట్టిన పేరకి మరింత సొబగు చేకూరేది. మున్ముందు కూడా చైతన్య వంతమైన కృషిసాహిత్యపరంగా చైతన్య సంస్కృతివారు చేస్తారనిఆశిద్దాం. —విలోకి.

స్వీకారం:

హంసపదిక; (ప్రణయ కావ్యం) రచన: తంగిరాల వెంకటసుబ్బారావు. ఎం. ఏ ప్రతులకు: యూనివర్సిటీ బుక్ సెంటర్ - ప్రకాశంరోడ్, తిరుపతి, వెల: రూపాయన్నర.

'సృజన' వచ్చేసంచికలో కొన్ని ఆకర్షణలు

కాళోజీ, సి. వి. కృష్ణారావు, పేర్వారం జగన్నాధం, అనుముల కృష్ణమూర్తి, మహాస్వప్న' నగ్నముని, నిఖిలేశ్వర్ గార్ల కవిత;
దుర్గానంద్‌గారి విమర్శనా వ్యాసం;
భైరవయ్యగారి కథ మొదలైనవి ఉంటాయి.

# వచన కవితా రచనలో పోటీ

## (కళాశాల విద్యార్థులకు మాత్రమే)

ఆధునిక కవితా ప్రక్రియగా స్థిరపడిపోయిన వచన కవితా రచనలో విద్యార్థుల ప్రతిభనూ, ప్రయోగశీలత్వాన్నీ గుర్తించి ప్రోత్సహించాలనే సంకల్పంతో ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని కళాశాలల విద్యార్థులకొరకు ఒక పోటీని సృజన నిర్వహించ దలచింది. ఇవీ నియమాలు:

1 రచన ఎంత చిన్నదయినను, పెద్దదయినను కావచ్చు. శుభ్రంగా కాగితానికి ఒకవైపే రాయాలి.

2 రచనలో కొత్తదనమూ, మౌలికతా, జీవమూ ఉండాలి.

3 రచయిత పేరు (ఉ. పే. కలం పేరు) తరగతి, కళాశాల పూర్తి వివరాలు వేరే కాగితం మీద రాస్తూ రచన తన స్వంతమని ధృవపత్రం రాయాలి.

4. ఆ రచన ఆ కళాశాలకు చెందిన ఆ విద్యార్థి దేనని, అది అతని స్వంతమని ధృవపత్రమొకటి కళాశాల ప్రిన్సిపాల్ గారినుండి పొంది జత పరచి పంపాలి.

5 ప్రతి ఒక్క రచయిత ఎన్ని రచనలయిననూ పంపవచ్చును. ఎంట్రీఫీజుఏమీ లేదు.

6 అన్నింటిలో ఉత్తమమయిన ఒకే ఒక కవితకు 30 రూపాయల విలువగల ఆధునిక వచనకవితా పుస్తకాలు బహుకరింపబడుతవి. అట్టికవిత వచ్చేసంచికలో ప్రచురింపబడుతుంది.

7 బహుమతి పొందనివానిలోకూడ యోగ్యమనిపించిన కవితలను ప్రచురించుకునే హక్కు మాకు ఉంటుంది.

8 తగినన్ని స్టాంపులు జతపరిస్తే తప్ప రచనలు తిప్పిపంపబడవు.

9 అన్ని విషయాల్లోనూ తుది నిర్ణయం 'సృజన'దే.

10 రచనలు డిశంబర్ 31 వ తేదీలోగా క్రింది చిరునామాకు చేరాలి.

ఈ పోటీ నిర్వహణలో ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని కళాశాలల అధినేతలూ విద్యార్థులు మాకు సహకరిస్తారని ఆశిస్తున్నాము.

సంపాదకుడు

సృజన (తెలుగు త్రైమాసిక)

పోస్ట్. జడ్చెర్ల స్టేషన్

జి. మహబూబ్‌నగర్.

**GOVERNMENT OF INDIA**

**OFFICE OF THE REGISTRAR OF NEWSPAPERS FOR INDIA**

This is to certify that the news paper ent tled SRUJANA has been registered uncer the Press and Registration of Books Act, 1867.

## CERTIFICATE OF REGISTRATION

| | | |
|---|---|---|
| 1 Title of the newspaper | | SRUJANA |
| 2 Registration numbe of the newspaper. | | R. N 10953/67 |
| 3 Language / Languages in whcih, it is published | | Te ugu |
| 4 Periodicity of its pub ication and the day/days/dates on which it is published | | Quarterly-6th of ea h third Month |
| 5 Retail price of the newspaper | | Re. 1/- |
| 6 Publisher's | Name | Shri Vara Vara Rao |
| ,, | Nationality | Indian |
| ,, | Address | Lecturer, Arts & Science College Jadcherla |
| 7 Printer's | Name | Shri Vara Vara Rao |
| ,, | Nationality | Indian |
| ,, | Address | Lecturer, Arts & Science College, Jadcherla |
| 8 Editor's | Name | Shri Vara Vara Rao |
| ,, | Nationality | Indian |
| ,, | Address | Lecturer, Arts & Science College Jadcherla |
| 9 True and precise account of the premises where the printing is conducted | | Parvathi Printing Press New Bazar, Jadcherla |
| 10 Place of publication | | Jadcherla, Mahbubnagar Dist. |

Dated 18/8/1967

**Registrar of newspapers for India**

'సృజన-మే 67 వ సంచికలో ప్రచురించబడిన శ్రీ కె. వి. రమణా రెడ్డిగారి 'ఖడ్గసృష్టి' సమీక్షా సమీక్షని సమీక్షించిన శ్రీ త్రిపురనేని వెంకటేశ్వర్ రావుగారి "సుమనోధాత్మక వేల" అన్న వ్యాసం వచ్చే సంచిక సృజనలో ప్రచురించగలము—

సం॥

మిత్రమండలి – కవితా సంకలనం

## విజ్ఞప్తి

అన్ని ప్రాంతాలలోని యువకవులు, మేము ప్రచురించ దల పెట్టిన సంకలనానికి వచన, గేయ, పద్యరచనలు పంపాలని కోరుతున్నాము. క్రొత్తవారికి, అముద్రిత రచనలకు, నిర్మాణాత్మకంగా వున్న వాటికి ప్రాధాన్యత యిస్తాము. ఎవరయినా, ఎన్నయినా రచనలు పంపవచ్చు. 1967 డిసెంబరు 31లోగా, కార్యదర్శి-మిత్రమండలి, 7/334, తూర్పువీధి, గూడూరు (నెల్లూరు జిల్లా)కు చేరాలి.

సృజనకు ఏడాది నిండింది, ఈ సందర్భములో మమ్ములను మేము అభినందించుకోవడానికి కాదు, తెలుగువాళ్ళ సాహిత్యాభిరుచిని, అభినందించడానికి ఈ అవకాశం తీసుకుంటున్నాము.

ప్రయోగశీలత్వమూ, సృజనాత్మక శక్తి, ఆధునిక దృక్పథం పునాదులుగా నిలపాలనుకున్న ఈ వేదిక నిర్వహించడము అపూర్వమే కాదు సాహసమని గూడ చాలమందీ హెచ్చరించారు. ఆ హెచ్చరికయే ప్రోత్సాహంగా, అభిమానమే పెట్టుబడిగా నాలుగు సంచికలు వెలువరించాము. నాలుగు సంచికల్లోనూ మేమాశించిన విలువలనెంతవరకు సాధించగలిగామనడానికి సృజన ఎప్పటికప్పుడు పుంజుకొని పురోగమించడమే నిదర్శనం.

ఈ జన్మదిన సంచికను ఎక్కువ పేజీలతో తెస్తున్నాము. ఈ సంచిక వచ్చేసమయానికే సుప్రసిద్ధ కథకుడు బుచ్చిబాబు చనిపోవడం ఒక యాదృచ్ఛిక ఘటన. అందుకే ఈ సంచికను బుచ్చిబాబు స్మృతికిఅంకితం చేస్తున్నాము. ఇందులో బుచ్చిబాబు సాహిత్య పరిశీలనం, వ్యక్తి పరిశీలనా సమగ్రంగా చేస్తున్న రచనలు రెండు ఉన్నవి.

సృజనకోసం 'తెలుగుసీమల్లో వర్డ్స్‌వర్త్' అనే వ్యాసం ఇస్తానని లోగా బుచ్చిబాబుగారు అన్నారు. చివరరోజుల్లో ఆ వ్యాసం రాస్తూ ఉన్నారనికూడ తెలిసింది. ఈ సంచికలో వారిది ఒక అసంపూర్ణమయిన అముద్రిత కథను కూడ ప్రచురిస్తున్నాము. ఎప్పటి వలెనే ఈ సంచికను కూడ పాఠకులు ఆదరిస్తారని మా విశ్వాసము.

వ్యాపారమూ, ఆడంబరమూ, డాంబికత తప్ప నిజమయిన విలువలు చిత్తశుద్ధి లోపిస్తున్న ఈరోజుల్లో ఒక వినూత్నమయిన ఆధునిక దృక్పథాన్ని కలిగించడానికి నిశ్శబ్ద విప్లవాన్ని రచించడానికి ఎంతో నిష్ఠురమయిన, కఠోరమయిన దీక్షా, సంకల్పమూ కావాలి. మాలో ఆ సంకల్పం ఉదయ సూర్యకాంతి వలె పరచుకొని ఉన్నది. ఆ కాంతిని కాపాడుకోవడం మనవంతు.

మా ఈ ఆదర్శాలు నచ్చితే, మేము నిజంగానే కొన్ని విలువలకోసం ప్రయత్నిస్తున్నామనే విశ్వాసం మీకు ఏర్పడితే హార్దికంగా, ఆర్థికంగా మాకు తోడ్పడండి మమ్ములను దారితప్పకుండా మాత్రమే కాదు, కుంటు పడకుండ అలసిపోకుండా కాపాడాల్సిన బాధ్యతకూడ తెలుగు సాహిత్యాభిమానులదే.

ఇన్నాళ్ళ మీ సహకారానికి, ఇకముందు మీ సహకారానికీ ఇవే మా హృదయ పూర్వకమయిన ధన్యవాదాలు.

*1967 Nov.* *Re. One*

Printed, Published and Edited by *Varavara rao* for **Sahithee Mithrulu.**